## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కాలక్షేపం

## ( TIT - BITS )

రెండవ భాగము

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

1

ఇంగ్లీషుపాఠం మూలుగుతూ జోగుతూ కునికిపాట్లు పడుతూ చదువుతూన్న కొడుకుతో,

సవితితల్లి—పొగరుమోతా ! క్రాపింగు అంటుగునేను ! అదా చదువు !

కొడుకు (ఉలిక్కిపడి క్రాపింగు సర్దుకుని)–టి హెచ్ యి ఎం యే యన్

(అని ప్రారంభించగా, ఆవిడవెళ్ళి వాడితలకాయి గోడ్కేసి కొట్టగా, కుర్రాడు ఏడుస్తూ, పుస్తకంకేసిచూస్తూ అందులోఉన్నట్టు)
........డబ్లుయూ ఐ డివోడబ్లుయూ ఎంయూయన్ డియే! వై బీట్!

2

తగులడిపోతూన్న ఒకకొంప ఆర్పిపెట్టడానికి కొందరు జాలిగుండెవాళ్ళూ, కొందరు వతనగా కొంపలారిపేవాళ్ళూ వచ్చింతరవాత ప్రేక్షకుల్లో ఒకడైన రాయుడుగారు, తన మిత్రుడు రంగకవిగారితో,

రా—రంగకవి గారూ ! అల్లాచూస్తే కార్యంలేదు, రండి బిందె పుచ్చుగోండి !

రం—ఉండవయ్యా ! రేపు నేను హెచ్చుతగ్గుగా వర్ణన్లుచేస్తే మళ్లీనువ్వే తాటాకులు కడతావ్ !

రా—అవీ ఉండవ్ కట్టడానికి ! పెందరాళే రావయ్యా !

3

తెలుగుమేష్టరు—"తల్లిదండ్రులు"-ఏ సమాసం వనమయ్య!

వ—చాలా ప్రమాదంఅండి. పచ్చిసమాసం.

తె—ఛీ! నోరుమూసుగో! పుండాకోర్! ఒక్కవరసగానే ఉంది నీనోరు!

కుసుమయ్య—(తన్ని అడక్కుండానే) ఒక్కవరసగా ఉంటా సమాసంలో పూర్వభాగం అండి! పరం బహు ఇదిగా అశ్లీలంగా ఉంది.

4

కోటయ్య—ఒరేయ్! బ్రహ్మయ్య మరీపొడుగురా, తాడిలాగ! నీకూవాడికీ చెడీపెడీ అయింది పేమిటీ?

బాపన్న—మరేరా! నేను! ఎగిరికొట్టాను, ఒక్కలెంపకాయ సాగదీసి! అది ఛళ్ళుమని వాడి పిర్రమీద తగిలిందిరా!

కో—మళ్ళీ కొట్టలేకపోయావ్ దవడ కందేటట్టూ!

బా—అనుకున్నా! యత్నించా! కాని, వాడి పొడుగు చేతుల్తో నాగొంతిగ డబాయించి ఉంచాడేమో, నే కొట్టిన చరుపులన్నీ గాలిలో దూసుకుపోడమే!

5

ఒక కచేరీ ఇవతల సాయంత్రపువేళ ఒకసంసారి ఒకపెద్ద మనిషిని కలుసుగుని,

సం—ఏసున్నా అంటే మళ్ళీ గౌరవనీయుణ్ణి. పెద్ద సభ్యుణ్ణి అంటావు. అయిదుదాటింది, లోపలికివెళ్ళి నా విషయంలో మంత్రిగారికి సిఫార్సు చేస్తానని చెయ్యలేదుకాదూ?

పె—మర్యాదగా మాట్లాడు. మధ్యాహ్నంవెళ్ళి ఓ గంట మాట్లాడివచ్చాను. నీకు భరవసా ఇచ్చింతరవాత ఊరుకుంటానుటోయ్, వెళ్లివాడా!

సం—ఎందుకొచ్చిందయ్యా, పచ్చిఅబద్ధం ? నేను ఉదయా న్నించీ గేటుదగ్గిర నుంచుంటేనే !

పె—చాదస్తుడా, రెండోగేటు లేదుటోయ్ ?

సం—మూడోదికూడా ఉంది. ఉంటేం ? రొండో దాని దగ్గిర మాతమ్ముడూ మూడోదానిదగ్గిర మాబావమరదీ పొద్దు ణ్ణించీ ఉన్నారు. చేతకాకపోతే, ఆమాట అనెయ్య కూడదూ, ఇల్లాఏడవకపోతే ?

6

నారాయణ—అచ్యుతం ! పాటకచేరి ఎల్లాఉంది ?

అ—ఆయన తగుదునమ్మా అన్నట్టు భాసింపట్టు వేసుగు కూర్చున్నాడు.

నా—సరేలే, పాటమాట ,

అ—భైరవి ఘంట పాడాడు, భోంచేసి ఊరికే 'బేవ్' మన్నట్టు ఉందిగాని ముండావాడికి ఏమీ ఆయాసమేనా లేందే !

నా—ఏదో ! తెలివిగలవాడేనా ?

అ-అబ్బో! మహాగడుసు! ఒక్కమాట తెలియనిచ్చాడుకాడు. మెచ్చుగునేవాళ్ళు అది చూసే !

7

సాంబమ్మ—ఏమమ్మోయి, రంగమ్మగారు ! ఇందాకా మీ ఆయన నీయెదటికొచ్చి అల్లా తెయితక్కలాడుతున్నారేం ? తడికిల్లోంచి చూశానూ !

రం—ఏముంది సంబడం ? నిన్న మీరు మీఆయన ఎదట ఆడుతూన్నసంగతి కిటికీలోంచి చూశారటా, అది నాతో ఇందాకా చెప్పడంసొంపూ అది !

8

ఒకజడధారి ఒకకుఱ్ఱాణ్ణి వెంటతరిమి పట్టుగుని.

జ—ఒప్పుకో !

కు—నేను చెయ్యలేదు,

జ—చేశావు.

కు—లేదు. నువ్వుచూశావా ?

జ—దేవుడుచూశాడు,

కు—దేవుడు అన్నీచూస్తాడా ?

జ—ఓ లెక్కేమిటీ ఆయనకు !

కు—మొన్నటిరోజున మానాయనమ్మ నన్ను తిడుతూంటే నేను నవ్వుతూకూచోడం దేవుడుచూశాడూ ?

జ—ఓ.

కు—(జడధార్ని ముక్కుమీద ఒక్కటిఇచ్చుగుని) ఫోసె ! మా నాయనమ్మ మా నాన్నని కన్నమర్నాడు పోయిందిట !

9

పేరమ్మ—మీకేం ? సినీమాలో కెడతారు, నాటకంలో కెడతారు. అడ్డమైనచోట్లకీ వెడతారు ! మొగాళ్ళు !

సూరయ్య—మొగాడివి కావనేనా నీకుపట్టుకున్న విచారం ?

పే—అవిచారం మీకుమాత్రం లేదూ, అప్పుడప్పుడూ ?

10

సోమయాజులు—రామంగారింట్లో పెళ్ళికి దక్షిణాదినించి సన్నాయిమేళం పిలిపించారట వెళ్ళావురా ? మనవాళ్ళు !

మ—ఆ. బాగాఉందిరా, సన్నాయేమిటి, "అబు" తంగా ఉంది,

సో—ఏమోరా, ఆసన్నాయిగాడు కూర్చునీ, లేచీ, కుస్తీ చేశాడు. కాని, ఎంచేతో నాకు నవ్వొచ్చిందిరా, ఆనందం కలగ లేదు. నేనూ వచ్చాలే!

మ—వాడిమాట కాదోయ్; ఆడోలు వాయించాడేం, వాడి సన్నాయిమాట నేచెప్పేది!

11

పంతులు—లెక్కతప్పు! మళ్ళీచూడు.

కుఱ్ఱాడు కొంచెంసేపటికి మళ్ళీ పట్టుగొచ్చి చూపెట్టగా,

పం—ఇంకా బేడతక్కువే, మళ్ళీచూడు.

కుఱ్ఱాడు మళ్ళీ పట్టాగా,

పం—ఆ లోతక్కువ అల్లానేఉంది.

కు—(కొంచెంసేపు ఆగివచ్చి) మేష్టాండి! ఇంకో లెక్క చేసి దానికి బేడఎక్కువొస్తే, రొండులెక్కలూ ఏకంగా రైటు కావండీ?

12

శివయ్యమొదటా, శివయ్యవెనక ఇంకాకొందరూ, మేడమెట్లు దిగుతూండగా, మెట్లు కొంత ఒడుదుడుకుగానూ జారుగానూ ఉండడంవల్ల.

శి—(కడంవాళ్ళతో) అయ్యా, జాగ్రత్త! జాగ్రత్తగా దిగండి.

పైవాడు—నువ్వుముందు జారకుండా దిగవయ్యా, మాజోలి నీకెందుకూ!

శి—అల్లాకాదులెండి. ప్రస్తుత పరిస్థితుల్లో నాజోలికంటె మీజోలే నాకు నెత్తిమీదివిషయం.

13

తాత—ఒరేయ్, చిన్నాడా! నిన్న, లాగూఅదీ తొడుక్కుని, కర్రుచ్చుగుని, పెదిమి కొరుక్కుంటూ నీతో వొచ్చాడు, ఆయనెవరూ ?

చి—కొండకోట ఎరుగుదువా ?

తా—ఆ.

చి—ఆ జమీందార్ని ఎరుగుదువా ?

తా—ఆ ఆ.

చి—ఆయన్తో పేకాడే ఆయన.

14

చెప్పరాని తంటాలుపడి పరీక్షపేపర్లు దిద్దడం సంపాదించుకున్న మేష్టరుతో,

లక్కరాజు—ఏమండోయ్, పెద్దయ్యమేష్టారు! పేపర్లు జోరుగా కొట్టేస్తున్నట్టున్నారు! ఎక్కడా కనిపించటం లేదు.

పె—మరేనండి. జోరుగానేఉంది.

ల—ఇంకా ఏమాత్రం ఉన్నాయి?

పె—ఇక లేవండి. ఏపన్లోనేనా పూర్తిగా చెయితిరిగిన తరవాత ఆపనే ఉండదు.

ల—నిజమే. లేకపోతే ఆచెయ్యేనా ఉండదు!

15

మంగమ్మ, వెంకమ్మతోకలిసి గుడికి మొక్కు పట్టిగెళ్ళి భక్తిపూర్వకంగా వినపడీ వినపడనట్టు,

మం—అనువులమ్మా, తల్లీ! నాకు నాలుగుపుట్ల ధాన్యం పండిస్తే, నీకు అందులో రెండుపుట్లు సమర్పిస్తాను.

వెం—(మంగమ్మ చెవులో) అంత మళ్ళీనువ్వు సమర్పించు గుంటే నీకు సహానికి సహం దండగ కాదుటో ?

మం—(అమ్మవారికి కనబడకుండా చెయ్యి అడ్డుపెట్టుగుని, కళ్ళుమూసుగుని, నాలిక ఆడిస్తూ వెంకమ్మ చెవులో) ఊరికే అన్నాను, మాట్టాడకు. ఆవిడికి ఈమాట వినపడొచ్చిందామిటీ! ఆవిడ మొహం !

16

ఒకస్వాములారు ఒక ఊరెళ్ళిన పదిరోజుల్లో ఆ ఊరిమీద ఆయనకి ఆగ్రహం రాగా,

జనులు—(సాష్టాంగపడి) దేవా కటాక్షించాలి, దాసులం! పాపులం !

స్వా—తక్షణము ఒక మహాసంతర్పణ చేయుడు. ముడుపు దండిగా కట్టుడు, లేనిచో ప్రక్క ఊరచేసినది ఇచ్చటనూ చేయుడు.

అనగా జనులు హడిలిపోయి, బోలెడోసి అవీ ఇవీ చేసి, కానిచ్చి చివరకి ఆయనకి నమస్కరించి,

జనులు—స్వామీ : దేవరవారు ఆ పక్క ఊళ్ళో ఏమిటి చేశారు ?

స్వా— ఆ ప్రక్కఊర మేము ఘోరమైన ఉపవాస మొకండు చేసియుంటిమి !

17

ఇనస్పెక్టరు ఎదట పాఠం ఇస్తూ,

మేష్టరు—రూపాయిలో అయిదవవంతు ఎంత ? నెంబర్ ఫోర్ !

నెం—మూడణాలకాని అండి.

మే—కూచో,

ఇ—ఆగండి. అబ్బాయి! అయిదు మూడణాలకాన్లు ఎంత?

నెం—రూపాయికాని అండి.

ఇ—అవునామరీ! గురువుగారు రూపాయిస్తే, నువ్వు ఇంకో కాని ఎక్కువిచ్చావే!

నెం—దక్షిణండి.

18

తండ్రి—ఈ మాటేనా బాగా తగలేశావ్రా, మార్కులూ?

కొడుకు—మళ్లీ హిస్టరీలోనే వచ్చింది కొంచెం "డెఫిసిట్టు"

తం—అంటే ఎక్కువా తక్కువరా వెధవా? వెధవ నాన్చుడమూ నువ్వూను!

కొ—తక్కువే.

తం—ఆయన ఎవర్రా? కర్రట్టిగెళ్ళి కనుక్కొస్తానూ!

కొ—లాభంలేదుట నాన్నా!

తం—ఏం?

కొ—స్కూలు మొత్తానికే వచ్చిందిట డిఫిసిట్టు.

తం—అఛితే, అదిలేని స్కూల్లోజేరి ఏడవకూడదూ?

కొ—అదిలేని స్కూలే లేదుట నాన్నా!

తం—అల్లానా! పోన్లే. కాలమానమే అల్లాఉంటే మనం ఎంజేస్తాం!

19

మేష్టరు—నరహరిరావు! పాఠం చదివావా?

న—చదివానండి,

మే—అప్పగించు.

న—జ్ఞాపకం లేదండి.

మే—ఏం గ్రహచారం?

న—పొద్దున్నే మానాన్న నాకు ఫర్గెటివ్ ఇచ్చాడండి!

మే—ఏమిచ్చాడూ?

న—ఫర్గెటివండి.

మే—దానికంటె నీ ఫరఫరలాడించడం బాగుంది.

20

భోగంమేళం రక్తికట్టి మజాగా అయిపోతున్న సమయంలో సభలోకూర్చున్న తెలుగుప్లీడరు గౌరయ్యగారు తన సరసని కూర్చున్న ఇంగ్లీషువకీలు కృష్ణారావుగారి చెవిలో

గౌ—కని పెట్టారా?

కృ—ఏమిటి?

గౌ—దాని మొహం!

కృ—మీ మొహంలా ఉంది! అసలేమిటీ?

గౌ—అదికాదండీ!

కృ—ఏమిటి మరి?

గౌ—మొహానికీ, అంత ఒత్తుగా మెత్తిందేం టూత్ పౌడరు, మరీనూ?

21

పుల్లయ్య—విన్నన్నా! ఎల్లాఉంది పంతులుగారి వ్యాసం?

వి—పంతులంటే నువ్వేనా?

పు—మరే.

వి—మొదట్లోకొంతచూస్తే, 'తరువాత చూడుదు' అనిఉంది.

పు—అక్కడ చూస్తే?

వి—'పైన ఉదాహరించినట్టు' అని ఉంది.

పు—మాధ్యస్తంలో చూస్తే?

వి—అక్కడ ఒక అక్కర్లేని విషయం కొంత చర్చింపబడి 'ఇంకా లోతుగా దిగబడడం అప్రస్తుతం' అని ఉంది.

పు—సంగతి నీకు తెలియలేదండూ!

వి—తెలియకేం? నీకు తెలియలేదని తెలిసింది.

22

ప్రణయరావు రచించిన ఓ గీతమాలిక ఒక శాస్త్రుల్లుగారు దీక్షగా చూస్తూండగా,

ప్ర—ఏమండోయ్, శాస్త్రుల్లుగారు! నా పద్యాలు అంతపరిశీలనగా చూస్తున్నారు, తప్పులుకోసమా ఏమిటి?

శా—అబ్బే! ఒప్పులకోసమే, దగ్గిరదారిగదా అని.

23

ఆగిఆగి స్కూలుఫైనలు పరీక్షకి వెళ్ళివచ్చిన రామయ్య కామన్నగారితో,

రా—లెక్కలపేపర్లో, వాడిదుంపతెగా, మేష్టరు చెప్పినట్టు "క్వాడ్రిలేటరల్" ఇచ్చాడ్రా!

కా—నువ్వు అదేనా చేశావా?

రా—లేదు. అదిరాందే? "ఇంపాసిబిల్"ట!

కా—అవున్రా. మేం వెళ్ళిన యేడూ అంతేట!

24

ము_త్తయ్య—అదేమిట్రా, వడ్డికాసులూ! మెడ అల్లాఉందీ? దవడ వాచిందేం?

వ—పిప్పిదంతం తీయించుకున్నాన్రా. వైద్యుడు పొర పాట్న ఘట్టిదంతం పీకాడు. ఓ పట్టాన్ని ఊడకపోతేనూ రొమ్ము మీద కాళ్ళు దబాయించి పట్టకారుతో మెలెట్టి గుంజాడు.

ము—ఏముచ్చుగున్నాడోరీ!

వ—మామూలుగా పుచ్చుగునే రూపాయీకాక, ఇంకో రూపాయి ఇస్తేగాని కిట్టదన్నాడు.

ము—ఎందుకూ? పొరపాటు బడ్డందుకా!

వ—చెప్పాడుకాడు చచ్చినా!

ము—మెడపొడుగు చేసినందుకు గావును!

వ—కావును! మొదట్లోలేనిది ఇప్పుడు తలకాయి సరంబీకి తగుల్తోంది. పోదూ! మన సొమ్మెంతమంది తింటున్నారు కారూ!

25

సుందర్రావు—ఏమండి నరసన్నగారు! మన వాళ్ళంతా వచ్చారటా!

న—(ఇంట్లోకి చూసి) ఏమే! సుందర్రావుగా రొచ్చారు.

సుం—నవ్వుతూ అడుగుతున్నానూ. "ఏమే" అన్నారు గదా. పెద్దావిడ పలుకుతుందా, రొండో ఆవిడా?

న—కావలసినప్పుడు ఎవర్తీపలకదు, అక్కర్లే నప్పుడు అంతా పలుకుతారు.

సు—సున్నితం, చెప్పకూడదుగాని, పెద్దావిణ్ణి "ఏమే" అని పిలవండి.

న—మరి తరవాత ఆవిణ్ణిమాత్రం ?

మం—"ఏజ్యూన్" అని పిలిస్తేసరి!

26

కొందర్ని కూచోబెట్టి శేషయ్య ఒకవ్రాతప్రతి చదువుతూ,

శే—"అంతట నతనికి దావాము వేయ"

అని ఉచ్చరించగా, బోధపడక

ఒకశ్రోత—'దావాము' ఏమిటి ?

శే—ఉండండి. 'వా' మీద ఏదో అంకివేశారు.

ఒకశ్రోత—ఆ అంకి ఉద్దేశం, కింద రాస్తారుచూడు.

శే—(చూసి) "అసలు 'హ' అని వ్రాయదలచి తలకట్టు మరచినాడ."

ఇంకోశ్రోత—అబ్బా! ఎంతపనీ! ఇంకా ఏమన్నా రాశాడా ?

శే—"అది అక్కడ ఉన్నట్టుగా భావించి చదువుకొనవలెను."

మరోశ్రోత—హారి! ఎంత సిరాపాడైందిరా! పీడితలకట్టు బంగారంగానూ!

27

గోపాళం—రాత్రి నాటకం ఎల్లాఉందిరా. దాసూ!

దా—వేషాలూ, తెర్లూ నాటకమూ, ఆడేవాళ్ళూ, మాత్రం పాతసరకు. సాంగ్సు కొత్త వేటగాని తబలావాడు మానేశాట్ట. లేడూ! ఉందీ!

గో—అయినా! సరిగ్గా చెబుదూ!

దా—ఏమో! నేను ఈ మధ్య చూసినవాటిల్లోకి బాగానే ఉంది, అన్నట్టు నువ్వూ వచ్చావుగా! నీ కెల్లాఉంది?

గో—నేను ఆ మధ్య చూడనివాట్లకంటె చాలా బాగుంది.

28

కోదండం తన స్నేహితుడైన బంగారయ్యతో కలిసి వచ్చిన కాశీగారితో మాట్లాడుతూ,

కో—నామాట కేవలం కొట్టిపారెయ్యకండి మరి, పది పణ్ణెండు భాషల్లో ప్రవేశంగల ముండావాణ్ణి.

కా—ఏమేమిటం డవి?

కో—(గబగబా) తెలుగూ, ఇంగ్లీషూ, అరవం, కన్నడం, హిందూస్తానీ.... (అని ఇక జ్ఞాపకంరాక) హిందీ....

కా—హిందూస్తానీ, హిందీ బహుదగ్గిరేగా?

కో—అయితేం లెక్కకి వేరేగా?

కా—అయితేం మీరన్నవి ఆరేగా?

కో—(కొంచెం తెల్లపోతాడు)

బం—ఆ ఆరూ రాయడంతోటీ చదవడంతోటీ పన్నెండనే కాదూ నీ తాత్పర్యం?

కో—అద్దమా! అదే. చూశారూ, కాశీగారు! వైఖరి కని పెట్టడంలో మావాడి ప్రజ్ఞ ఇంతాఅంతా కాదు.

కా—తెలుస్తూనే ఉందండి. మీప్రజ్ఞకి అధమం రెట్టింపు ఉంటుంది.

29

విమలాపురంలో కథ చెబుతూ ఒక హరిదాసుగారు తాళం తప్పుతూండగా సభలో కూర్చున్న వారి సాటిహరిదాసు ఒకాయన అది భరించలేక,

సా—అయ్యా! మీరు ఫక్తు ఆపాటేదో పాడుకుంటూ పొండి, తాళం ముట్టుగోకుండానూ! ఆ తాళంగొడవ నే చూస్తుంటానూ!

అనగా సభలో మరొకడైన త్రివేణిరావు సాటిహరిదాసుతో,

త్రి—అల్లాకాదండి. తమరు ఎల్లానూ తలపెట్టుకున్నారు గనక ఆపాటకుడా తమరే చూస్తే కృతార్థులం.

హరిదాసు—మరి నేనో!

త్రి—మీకేం గంతెయ్యండి హాయిగానూ!

30

రామయ్యా కామయ్యా. ఒకరోడ్డుమీద ఉన్న ఒకమనిషినీ ఒక దున్నపోతునీ చూస్తూ పొలాలికి అడ్డంపడి అటేనడిచి వెడుతూన్న సమయంలో ఒక మోటారుకారు వచ్చి దున్నపోతుని పక్క కాలవలోకి నెట్టి పారెయ్యడంతోటే ఆ మనిషి బూతులు తిట్టి కళ్ళెర్రచెయ్యడంచూసి డ్రైవరు ఆ మనిషిమీద ఓమనీపర్సు పారేసి పోయేసరికి వీళ్ళు రోడ్డుసమీపించగా,

మనిషి—(జాలిగా) పాపం! ఎవరిదో దున్నపోతు! ఎంజేస్తాడు డ్రైవరుమాత్రం?

కామయ్య—ఎవరిదైతేం? కారు ఆపద్దుటయ్యా, చచ్చులాగ ఊరుకున్నావ్!

అంటూ దున్నపోతుకి ఏదో చూస్తూండగా ఆమనిషి పర్సు తీసి అందులో డబ్బులేకపోవడమేకాక అది చిరిగిపోయిందని కూడా గ్రహించి వాళ్ళతో,

మ—(కోపంతో) ఊరుకోడవేం? కారునెంబరు ఆరువేల ఘదఉంది. సాగతీద్దాం రండి!

31

సుబ్బన్న—ఒరేయ్, శ్రీరాములూ ! మన శివరావు పాడుతూ మధ్య మధ్య హ హ హ హైఁ హై అంచూంచాడేమిషి ?

శ్రీ—తనపాట హాయి హాయిగా ఉంటుందని, ప్రాలుద్ధంచేత విన్నవాళ్ళు, ఆలస్యంకాకుండా అనుకోడానికి.

సు—వెనకతను హైదరాబాదులో కొన్నాళ్ళున్నానని గర్వం కొద్దీ కామగదా !

శ్రీ—అందుకో, లేకపోతే తనుపాడేది హిందూస్తానీ బాణీ అని అందరూ గ్రహించడానికో.

సు—అహో అందుకనా ! హల్లాచెప్పూ ! హిప్పుడునచ్చింది !

32

చంద్రుడుగారు రాత్రి ఒంటిగంటకి మామూలుగా ఒకపని మీద బైటికిరాగా, గబగబా రోడ్డుమీద డాక్టరుగారు వెళ్ళడ మున్నూ వెనకాలే భంట్రోతు రావడమున్నూ గమనించి, భంట్రోతుతో

చం—ఎక్కడకోయ్ ! తొందరగా వెడుతున్నారు?

భం—భగవాన్లుగారి ఇంటికండి.

చం—ఏమిటికథ ?

భం—ఆయన "వైఫ్" గారు నెప్పులతో "ట్రబుల్" పడుతున్నార్టండి, "అర్జెంటు" గా "కా" లొచ్చి డాక్టరుగారు "ప్రెగ్నెంట్" చెయ్యడానికి వెడుతున్నారండి.

చం—వెళ్లుపాపం ! ఇంగ్లీషులోకుడా గర్భకవిత్వం వచ్చిన్టోయ్ నీకూ !

33

సంభావనదొడ్లో వెనకాల సూరయ్యతో,

కి_త్తన్న—సూరయ్యా! గేటు కేసిచూడు! ఏ మిస్తూన్నట్టు?

సూ—అర్ధా, పావలా, బేడాట! మనికి ఆఖరిదే!

కి—ఏడిశారు! నాకు అర్ధే తెమ్మంటాను. ఇంతంతున్నాం, మనికి బేడేమిటి?

సూ—వాళ్ళకామాత్రం తెలియదూ! నీకు వచ్చి చచ్చిం దేమి టంటారు!

కి—నాకేమీ ఎంతమాత్రం రాదుగనకనే పెద్దసంభావన ఇవ్వాలోయ్ చవటల్లాలా అని వాదిస్తాను. అయితేనూ, ఎంత మందో చూడు!

సూ—ముగ్గురు, ఓడు సంచీపుచ్చుగున్నాడు. ఓడు సంభావన ముట్టడంతోటే మనిషిని కిందికి ఈడ్చేస్తున్నాడు,

కి—మరి మూడోవాడు?

సూ—ఈడవబడేవాడిచేతులో ఏమన్నా ఉంటే తనుచ్చుగుని ఈడుపుపూర్తి అయింతరవాత వాడికిచ్చేస్తున్నాడు.

కి—సరే నేను ముందువెళ్ళి ఈడ్చేవాళ్ళని ఈడ్చేస్తా అప్పుడు నాకు అర్ధ ఎల్లానూ ఇవ్వాలిగదా అని, ఈడవడానికి నన్నా ఉండమంటారు. ఇంతతో నువ్వురా, నిన్ను ఈడవడం నాకు తరంకాదంటాను. నాకంటె గొప్పవాడవుకదా అని గ్రహించి నీకూ అర్ధఇస్తారు.

34

సేతుపతి గారింట్లో సదస్యం సందర్భంలో దొడ్డివగ్గిర ఒక తిమ్మయ్యగారికి అణా యివ్వగా, ఇచ్చినవాడితో,

తి—తాటిమట్టలు పాదాలకి కట్టుగుని, పుంత కడ్డమడి, చెవులు ఘడియలడి, ప్రాణంకళ్ళంటి, దేవుడా అంటూ వస్తిని గదా. అణాటయ్యా, నాకూ !

ఆయన—నీకు ఏమేంవచ్చు ?

తి—నాకా ! నాకు లక్షవచ్చును. అదంతాయెల్లా యిప్పుడు చెప్పడం : పెళ్లికి తెలుపులిస్తారని పుకారువెయించి, అర్ధణా టయ్యా. వెధవఅర్ధణా !

అనేసరికి ఇచ్చే ఆయనదగ్గిర మద్దతున్న మనిషి తిమ్మయ్యని దవడ ఊడ్చి వీధిలోకి లాగగా, తిమ్మయ్యవెళ్ళి మైలవాడికి మళ్లే గంధం పెట్టుగుని జుట్టు విరబోసుగుని మళ్ళీవచ్చి వీధికి అడ్డంగా నిలబడి ఆకాశంకేసి చూస్తూ పొత్రంతో సొట్ట బాదు కుంటూ,

తి—అయ్యోదేవుడా ! ఈ సేతుపతిగారింటో పెళ్ళి అనే నిమిత్తం కల్పించి నన్ను రప్పించి లాక్కుపోతున్నావుట్రా ! అంటూ గోలగా ఏడ్చేసరికి. సేతుపతి పరిగెత్తుగొచ్చి,

సే—అయ్యా ! నన్ను కటాక్షించండి ! ఇదిగో రూపాయి ! తగ్గండి. లెండి, స్నానంచేసి మడికట్టుగుని రండి, అనగానే తిమ్మయ్య అది పుచ్చుగుని స్నానానికి వెడుతూండగా, అత నితో అతని స్నేహితుడైన నమ్మయ్య,

న—నిజంగానే కొట్టుగున్నావురా పొత్రంతో ! నెప్పట్టలా ?

తి—లగ్గసరికాదుట్రా మరీ ! ఊహూ అజీర్ణం ! ఎం జెయ్యనూ !

35

ఎల్లాగైనాసరే ఒప్పించి భోజనం చెయ్యాలని ఒక గృహస్తు ఇంటికి కామాక్షి సుందరం వెళ్ళి, కొంత ప్రసంగం నడపగా.

గృ—అల్లాయితే మీకు పనసారాదూ ?

కా—రాకేమండీ ! కొద్దాగాపోప్పి. యథాశక్తి, వాణీ కటాక్షం వల్ల, నేనూకొంత, దాని బొడ్డుటొక్కా, మరి....

గృ—ఏదీ, కొంచెం !

కా—నాకూఃఅయిదుగురూఃకొడుకులూఃఅందులోః

గృ—ఇదేమిటండోయ్ ! ఇది సంస్కృతమే కాదుగా !

కా—మీ రెరగరుపాపం ! తెలుగులోమాత్రం లేదూ, పనసా !

గృ—ఉంటేమట్టుకు, ఉదాత్త అనుదాత్తాలో !

కా—ఇప్పుడు మన సంభాషణయావత్తూ అనుదాత్తం ! భోజనం అరణ్యమెంటు చెయించండి ఉదాత్తంపూచీ నాదీ !

36

ప్రకాశం—ఏమండీ మేష్టారూ !

మే—ఏమిటి ?

ప్ర—ఈగంట మాకు డ్రాయింగులేదండి !

మే—శుభం. ఇప్పుడు ఏమిటి నువ్వనేది ?

ప్ర—ఎవరో ఉందని అన్నారు నాతో !

మే—నీ 'తో' అన్నది ఇంగ్లీషు నేనా ?

ప్ర—అవునండి.

మే—అంటే తక్షణం ఆ డ్రాయింగేకానీ !

37

నాగమ్మగారు ఇంటికొచ్చిన తన చెల్లెలి మరిధితో ముచ్చటించుతూ,

నా—మీరేమన్నా చదువుకున్నారా ?

మ—దులాభీగా తిరగడంచేత చదువు వెన్నేసిపోయిందండి మనికి.

నా—ఏమన్నా ఉద్యోగమాండీ ?

మ—అబ్బే ! మనకి ఓపే ఉద్యోగమ్ఉండి !

నా—ఏమన్నా పిల్లలాండి ?

మ—మనికి ఆబాధోటి లేదండి నేటివరకు !

38

ఒకాయన ఉద్యోగం దొరక్క గర్వంచచ్చి శాంతం హెచ్చి మేస్టరీ ట్రైనింగులో చేరిన కొత్తరికంలోనే ఒకనాడు డ్రాయింగు గంటలో డ్రాయింగుమేష్టరు ఒక నక్కబొమ్మ గోడబల్లమీద గీయగా,

ఆయన—(ఏర్పడని పరిచయంతో) అదేం కర్మమండోయి మేష్టారు ! ఎక్కడో పెద్ద "డిజ్ అప్పాయింటుమెంటు" అయి వచ్చినట్టు తోకముడుచుగున్నట్టు అల్లా వేశారేం నక్కనీ ?

మేష్టరు—"అప్పాయింటుమెంటు" అయినతరవాతగదా తోక లేవడం, ఇప్పణ్ణించీ ఎందుకని !

39

రామగోపాలం—ఒరేయి, వరదరాజులూ !, నువ్విచ్చేవన్నీ దొంగసాక్షీకాలని రత్తయ్య నిన్ను యాగీ పెడుతున్నాష్ష !

వ—నిజం ! నిజమే ! వెళ్ళి పళ్యాడగొడతా ఒఖ్ఖలెంప కాయితోటి.

రా—(చప్పరించి) ఒఖ్ఖ లెంపకాయకి ఎన్ని ఊడతాయి మహా !

వ—ఏం ? రెండువరసలూనూ !

రా—అల్లాయితే, రెండుమూడు కొడితేగాని తెమల్దేమో!

40

ట్రైనింగు అయిన ఒకమేష్టరు ఒకస్కూలుతాలూకు కమిటీ మె (నె) ంబరు దగ్గిరికెళ్ళి నమస్కరించగా,

మెం—ఏం సెప్పుగోవాలో సెప్పుగో మాతోటి !

మే—తమస్కూల్లో పోస్టు ఖాళీట.

మెం—అయితే ! దరఖాస్తుఇయ్యి ! సూద్దారి !

మే—దానికి జీతం ఏమిస్తారు ?

మెం—అది నీకొచ్చేదవద్దూ ! ఏదోయిత్తారు ! (హేళనగా) భోయినం ఎట్టీ యిాధిగదిత్తారు ! ఎల్దూ !

మేష్టరువెళ్ళి అప్పుడే మళ్ళీవచ్చి,

—పోనీ ఆగది, లోపలిగది, అయేటట్టు చూడండి. పబ్లీకున అల్లరిలేకుండా గుట్టుగా జీవిస్తాను, తీరిపోతుంది.

41

థర్డుఫారంలో ఇంగ్లీషుపాఠం చెబుతూండగా, "హౌస్ ఆఫ్ లార్డ్సు" అనేముక్క ప్రయోగించి,

మేష్టరు—మీరు విన్నారా, "హౌస్ ఆఫ్ లార్డ్సు" అనేది, లేక ఇదే వినడమా ?

గుర్నాధం—అందులో మెంబర్లని బొమ్మలో చూశానండి, చాలాశుంది దొర్లు కూచున్నారు.

మే—ఆడవాళ్ళు లేరూ ?

గు—ఎల్లాఉంటారండీ ! ఉంటే ఆభాగాన్నేనా "హౌస్ ఆఫ్ లేడీస్" అనాలి.

మే—నువ్వెరగవోయ్! అందులో పురుషులూ స్త్రీలూకూడా ఉండచ్చు!

గు—అదితెలుసండీ! అదేగదా "హౌస్ ఆఫ్ కామన్సు!"

42

బసవయ్యగారు లెఖ్ఖ తెలియక సంచీలో ఒకరూపాయి నాణెం, పావలాకాసూ, అణాకాసూ వేసి మొత్తంమీద 'మూడు' అని జ్ఞాపకం ఉంచుగున్నాడు. వాళ్ళబ్బాయి లెఖ్ఖల్లోవాడు. వాడు అవి లాగేసి వాటిస్థానే ఓపదిడబ్బులు గిరవటేసి మళ్ళీ సంచీ కట్టేశాడు. మర్నాడు బసవయ్య మళ్ళీ లెఖ్ఖచూసుగుని, సొమ్ము హెచ్చయినట్టు తనికితోచి, కుర్రాణ్ణి పిలిచి,—

బ—అబ్బాయ్! సంచీలోకి ఇన్నెల్లావొచ్చాయిరా?

అ—(శ్రమించినట్టు) నేను సంపాదించి అందులో కలిపేశాను నాన్నా!

బ—(మూడు నాణాలుంచుగుని తక్కినవి ఇచ్చేస్తూ) ఛీఛీ! నీసొమ్ము నాకెందుకురా! నీ డబ్బులెట్టి నువ్వు ఇంచఖ్ఖ ఏమన్నా కొనుక్కో.

43

అచ్యుతం—అదెయ్యా! పూర్ణయ్యపాకం ఎల్లా ఉంటుంది?

ఆ—ఓ మాభేషుగ్గా ఉంటుంది.

అ—నిజంగా చెప్పూ!

ఆ—వేళాకోళంకాదు, ఒకటోరకంగా చేస్తాడు, పూర్ణయ్య శీతాకాలంలో. వెనక చారుకాచడంలో అంతటివాడు లేడని అతణ్ణి గరిటె చేతికిచ్చి ఊరేగించారు ఎరగవ్?

అ—ఎరుగుదున్లే. కాని, నువ్వు శీతాకాలం అంటున్నావు, వేసంకాలం మాత్రం!

ఆ—అబ్బే, అప్పుడూ దివ్యంగానే ఉంటుంది కాని, ఒకటీ! వేసంగిలో అతనుచేసే ప్రతీవంటాకూడా ఎక్కువ ఉప్పు అతను వెయ్యకుండానే మరీ ఉప్పఉప్పగా ఉంటూంటుందని అంటారు భోక్తలు!

44

తండ్రి—అబ్బాయీ! చూసిందల్లా కొని తగలెయ్యకురా మరీ! నేన్ తేలేనూ! ఊహూ మనింటో డబ్బులు కోళ్ళేరుకు తింటున్నా యనుకున్నావా, మనకేమన్నా డబ్బులెచ్చెట్టుందా!

అ—ఏమిటినాన్నా అల్లాతెలియకుండా కేకలేస్తావ్ నేను నీకు పాతికరూపాయలు నయంచేసి పెడితేనూ!

తం—అదెప్పుడ్రా?

అ—మరి, నేనీయేడు ప్యాసయితే నువ్వు పాతికరూపాయ లిస్తానన్లేదూ నాకూ!

45

శివయ్య—బాలయ్యకి గుండెజబ్బుట! విన్నావా!

భార్య—లేనిపోని మాటలాడకండి!

శి—నిజమేట. చాలామంథి చెప్పారు. వొర్తిమాటలని చూస్తున్నావా?

భా—వొర్తిమాటలా మళ్ళీమాట్టాడితే శుద్ధ అబద్ధంమాటలా?

శి—అల్లాయితే నువ్వు నమ్మనంటావా?

భా—సుతరాఘూ నమ్మను.

శి—అంతరూఢిగా నీకెల్లా తెలుసూ?

భా—అసలు అతనికి గుండె ఏడిసిందా ఏమిటి!

46

శేషాచలం—ఏంరోయ్ దామోదరం! పరీక్షమళ్ళీ గికేసిం
ఏన్నా నే. నాదీ అంతే. ఇది ఇహతెమల్దురా. నేను ఫే
నందుకు ఏమీలేదు, మనం పుస్తకం విప్పంగా! నీపే
లిస్టులో చచ్చుపెద్దమ్మల వన్నీ ఏడిశాయి!

దా—అల్లానే జరుగుతూంటుంది! మార్కులు పరిష్క
చోట శుద్ధబ్లాక్‌హెడ్‌లు పోగైనప్పుడు ఏమవుతుంది?

షా—అయిందేదో కాగా నోటివట్టంమాటలుకూడా ఎందు

దా—తప్పేముందోయ్! ఆ కచేరీలో జిల్లాఒక్కంటికి
"బ్లాకూ" ఒక్కొక్క 'బ్లాకు'కి ఐక 'హెడ్డూ' ఉంటారు.

47

వ్యాఘ్ర—వామన్రావ్! పుట్టయ్య కనిపించటం లేదేం

వా—అహఁ ఇందాకా, మనపక్కనించి వెళ్ళలేదు
బజార్లో?

వ్యా—ఎప్పుడ్రా!

వా—ఏడిసినట్టేఉంది. నువ్వు మిఠాయిదుకాణంమీద
చూస్తానని చెబుతూ పకోడీలకి అడ్డంపడ్డప్పుడు!

వ్యా—అల్లాయితే నేను వాణ్ణి ఆనవాలు పట్టలేకపి
నంటావా!

వా—వాడికి వెనకటి మొహంతీరే పోయింది. పైగాఇ
గర్వంకుడానూ!

వ్యా—మొహంతీరుపోవడం ఏమిటి ? గర్వం ఎందుకు ?

వా—తను మహామహా గవర్నమెంట్లవల్ల కానిపని చేశాను గదా అని.

వ్యా—ఏమిటాపని ?

వా—పాతిగముప్పై పన్నులు తీయించిపారెయ్యడం !

48

వై—ఏముటో ! ఊరికేను ! మన ఆయుర్వేదానికి అంత పెట్టేసి, ఆ మ్లేచ్ఛుడి అసందర్భవైద్యానికి ఎగడతానంటా వేమిటి ? వాడు పుటాలెరుగునా, భస్మాలెరుగునా, అనవా లెరుగునా. అరిష్టాలెరుగునా ?

రోగి—ఎరుగును.

వై—ఎరగడు. నీపక్షవాతం వాడికి లొంగదు.

రోగి—లొంగుతుంది నే పోతాను.

వై—నువ్వు నడవలేవు, వెళ్ళకు.

రో—వాడు తెలివి గలవాడయ్యా !

వై—కాడయ్యా, అల్లాకనిపిస్తాడు. నేను కుదరుస్తానయ్యా !

రో—నీవల్ల కాదయ్యా !

వై—వల్లకాకపోతే మంచి కర్రకాళ్ళైనా చెయించి ఇస్తాను. ఆమాటకూడా అనని వాడిదగ్గిరికెళ్ళి అన్నిందాలా పాడవకయ్యా. నీతో చావొచ్చింది !

49

వీరలింగం—జగ్గయ్యా ! ఎక్కడికి ?

జ—పొడుగు కొలుచ్చుగోవాలి.

పీ—నీ పొడుగు బొగ్గులైనట్టేవుంది. పోలీసులో జేరతావా ఏమిటి ?

జ—అబ్బే ! నేను ప్రతీసోమవారం కొల్చుగుంటూ ఉంటా నసలు !

పీ—ఏం ?

జ—ఆదివారం ఆదివారం తలంటు పోసుగుంటాను ? అంచేత.

50

రత్నపతి—సురేశం ! ఎక్కడికన్నావు ప్రయాణం !

సు—కాశీ.

ర—ఇది యింకా ఉత్తరాయణమేగావును !

సు—అయితే ?

ర—ఈ ఆయనంలో మీనాన్నకి ఏమీ ప్రమాదం ఉండ కూడదుమరి, దక్షిణాయం రానీ !

సు—ఎందుకూ ?

ర—ఏకంగా అప్పుడు వెడుదువుగాని ! రెండు ఖర్చులు ఎందుకూ ! ఎముకలు పొడుంచేసుగోడం ఎందుకూ !

51

కొడుకు చదువుకోడం తప్ప ఇంకఏమీ ఆశించని, ఒక తండ్రి – నువ్విప్పుడు చదివే యఫ్. పే. ఎన్నాళ్ళురా, అబ్బాయి !

కొ—రెండేళ్ళునాన్నా, ఏం ?

తం—యం. యే. అంటారు, అదెన్నేళ్ళు ?

కొ—అదీ రెండే!

తం—దీనికి మల్లేనే దానికికూడా క్లాసులోజేరి తంటాలు పడాలి గావును!

కొ—ప్రేవేటుగా వెళ్ళచ్చు!

తం—అల్లాయితే దానికి తక్షణం ప్రేవేటుగా కట్టి చూడ కూడదు. నువ్వూ, అదృష్టం ఎల్లాఉంటుందోనూ?

52

వనమయ్య తనికి మంచినీళ్ళు ఇయ్యారా, తాగి, చప్పరించి,

కోటేశ్వరరావు—వనమయ్యగారూ! మంచినీళ్ళు కొంచెం కారం కారంగా ఉన్నా యేమిటి?

వ—ఎమోబాబూ! అక్కడికీ నేను కారం జాగ్రత్తగా చూసే వేశానండీమరీ! ఎంచేత అల్లాఉన్నాయో!

కో—సంతోషించాంలెండి, కారంవేశానంటూ స్వంతకవిత్వం కొంతా మీరు!

వ—చాల్లెండి కారంగాఉన్నాయంటూ సొంత పైత్యం కొంతా మీరు!

53

స్నేహితులు—సుంవయ్యా? నీకు డొక్కచీలిస్తే ముక్క లేదుగదా! నీకు, సంస్కార్లతోపాటు, సంభావన, రూపాయి ఇచ్చిన వాడెవడ్రా?

సుం—అందరు పెద్దవాళ్ళూ వెళ్ళేవరకూ ఆగి అప్పు డొచ్చానేను.

స్నే—వస్తే!

సుం—అడిగాను, ఇదివరకు వెళ్ళిన పెద్దవాళ్ళతో రాలేదేమని. వాళ్ళు పరమశుంఠ లవడంవల్ల వాళ్ళతో కలిసి నే రాలేదూ, కావలిస్తే నన్ను పరీక్షచేసుగోండన్నాను. అని ఏవో పులగపుశ్లోకాలు రొంతు దంచాను.

స్నే—వాళ్ళు పోల్చలేదూ!

సుం—వాళ్ళ కవేనా రావుగా మరీ!

స్నే—హరి! ఏంపుణ్యంరా! మమ్మల్నికూడా లాక్కుపోరా!

సుం—మనం చాలామంది ఓచోటఉంటే తెలిసి పోతాంరా! పోలికలు ఉండకపోవ్! పైగా నవ్వొస్తుంది.

54

అప్పయ్య—కుర్చీలో కూర్చోరా, తిమ్మరాజూ! వస్తున్నా. అని ఇంటిలోపలికి వెళ్ళివచ్చి, మంచినీళ్ళు తెచ్చి, ఇంకా ఏదో దెచ్చి తిమ్మరాజుకి అందిస్తూ,

అ—ఇందరా! కొంచెంపుచ్చుకో! ఈమధ్య మా చెల్లాయి హేమలత.........

తి—ఏమిటిదీ!

అ—చలిమిడి?

తి—ఇంకా చిమ్మిలేమో అనుకున్నాన్రా! పిల్లా! పిల్లాడా?

55

వీధులో వెడుతూన్న కుంచెన్నని 'మాట' అని ఇంట్లోకి పిల్చి ఊళ్ళరయ్యగారు కుంచెన్నకి దవడశుద్ధి చెయ్యగా,

కుం—(తిరిగి అప్పట్లో జబరదస్తీ చెయ్యలేక) ఇదిటయ్యా నమ్మించి, లోపలకీరమ్మనీ! ఆలా యీలా కాకుండా చదివావు, ఇదేనా నీ లాహిరీ!

ఈ—ఈపాటికి కిక్కురుమనక రోడ్డుచ్చుగో! మాటా దొచ్చావు పైగాను! "ప్లీడర్ల బల్లలు నాలుగైదు తీసిపారేశానండోయ్" అని నాతో వెనక అన్నావ్, సీపోటిగాడే ఇప్పుడు నాబల్ల తీసేసి తూంలో గిరవటేశాడు.

కుం—నాపోటీగాడైతే నన్నెందుకూ కొట్టడం?

ఈ—వాడికీ నీకూ తేడాఉందేమో చూడ్డానికి ముందు నీ దవడ కొల్చాను. వెళ్ళి వాణ్ణి తీసుకురా! తేడాఉంటే ముదరా యిస్తాను.

56

సారధి—అల్లాయితే వొత్తిదే, గణేశూ! మళ్ళీ పెద్దజంతువులా ఉంటాడు పైకి! కుస్తీమాట అటుంచి, ఆ పంజాబీ వచ్చేటప్పటికి వీడికి వాంతులూ అవీకూడా పట్టుగున్నాయిటేమిటి?

సీతారాం—నిజమే. అదివరకు ఆ పంజాబీ పేరువెబితే మీసంమీద చెయ్యేసేవాడు. వట్టి వ్యర్థప్రజ్ఞలు తప్ప ఏమీలేదు—ఉత్తరుడు!

సా—అబ్బే! ఉత్తరుడు ఇంకానయమే. అర్జునుడితో కొన్ని మాటలేనా ఆడాడు. వీడు అదీలేదు. ప్రతీదానికి వీడు శుద్ధ నిరుత్తరుడు!

57

ఆత్త—లేవండి! కాళ్ళు కడుక్కోండి, సంధ్యవార్చడానికీ దానికీ ఇంకా ఆలస్యం అవుతుంది గాబోలు! ఇంటింటి వంట,

అల్లుడు—సంధ్యవార్చటం అయి చాలా సేపయిందండి !

అత్త—ఎక్కడండి ?

అ—ఇందాకా ఆకాలవలో !

అత్త—కాలవకి నీళ్ళు ఇంకా రాలేనట్టుందండీ ?

అ—వస్తున్నాయి లెండి, మీ ఊరుదాకా రాలేదేమో, నలుగురుముగ్గురు చెప్పారు.

అత్త—మావూళ్ళో అసలు కాల వేలేదండీ !

అ—అల్లానా ! మీవూళ్ళో ఎంతెంత అబద్ధాలకోర్లు ఉన్నారండీ !

అత్త—ఉంటేం ? మీరే నెగ్గారు, లేవండి.

58

కనకయ్య—భాష్యంమామా ! పింఛను, ఏనెలది నీకు చేరక పోతా, రామేశ్వరం ప్రయాణంవల్లా ?

భా—జూలైది.

క—తరవాతవి ముట్టాయా, ఈ నవంబరు వరకూ !

భా—ఆ.

క—అల్లాయితే జూలైది పంపడానికి పైవాళ్ళకి ఆక్షేపణ ఏమిటి ?

భా—ఏమో వాళ్ళబొడ్డుబొక్కా ! జూలైలోకూడా నేను జీవించి ఉన్నట్టు సర్టిఫికెటు కావాల్ట. లేకపోతే పింఛను ఛస్తే పంపర్ట.

క—అవు నవును, చచ్చినా పంపరు,

59

సత్రాజు—ఏమండీ! జ్వాలా రెడ్డిగారు! చెన్నపట్నం వెళ్ళొచ్చారూ?

జ్వా—ఏదో మళ్ళీవచ్చి ప్రజల్లోపడాం!

స—ఎక్కడ బస?

జ్వా—చాలా బహిష్టోపులున్నాయి, ఆ దగ్గిరేఉంది ఒక ఆంజినీలు వుటేలు, అందులోకి తీసికెళ్ళారు ప్లీడరు.

స—పట్నంలో గొప్పగొప్పవి ఏమన్నాచూశారా?

జ్వా—ఎవడో దొరటండి. ఎక్కడచూసినా వాడికొంపలే. అవి చూశాం వీధికి అయిదారు చొప్పున.

స—ఆ దొరెవడండోయ్?

జ్వా—టొలెట్టు దొరటండి.

60

అన్నదమ్ముల పంపకాలమీద లెఖ్కయిచ్చి, కొంతసేపు చూసి, ఎవరూ చెయ్యలేకపోగా,

మేష్టరు—సీరయ్యా! అన్నగారికి ఎన్నివంతులు? అని వుంది లెఖ్కలో?

సీ—పదిహేనండి.

మే—ఎన్నింటికి? కళ్ళులేవూ?

సీ—నూటికండి.

మే—నూటికి పదిహేనయితే, ఒకటికి?

సీ—నాకు రాదండి.

మే—ఏంతెగులూ, రాకపోడానికి?

సీ—ఇప్పుడే వెళ్ళొచ్చానండి.

61

తెలుగుమేష్టరు—లోకయ్యా! పండిత పుత్రుడు—అంటే ఏమిటి?

లో—పండితునియొక్క కొడుకు.

తె—సరే, కాని, సాధారణంగా అది ఏ అర్థంలో వాడతారు?

లో—తెలియదండి.

తె—'తెలియనివాడు'—అనే అర్థంలో వాడతారు.

లో—అల్లావాడడం తప్పు కాదండీ?

తె—ఏడిసినట్టేవుంది, నువ్వేనాఏమిటి చెప్పేవాడివి!

లో—కాదండి. పండిత మోతీలాల్‌గారి పుత్రుడు పండిత జవహర్‌లాల్ కాదండీ! ఇక ఆ మాటలకి అర్థం మార్చాలి.

62

లక్ష్మమ్మ—గురవావధాన్లుగారూ! గోదావరి ఎప్పుడొస్తుంది ఈ యేడూ? ఇహమరి ఆషాఢం జొరబడిందికదా!

గు—శుద్ధాష్టమి దాటదుగా!

ల—ఎవడెరుగు నాయనా. రూలుసామటీ, అఖండగౌతమికి?

గు—మరి ఎందుకు అడిగారూ? కవికి లెఖ్ఖేమిటీ, దాన్ని బంధించాడు.

ల—ఏమనీ?

గు—ఆషాఢశుద్ధ సప్తమ్యాం వచ్చునే వృద్ధగౌతమీ!

అథవా తప్పిజారీనాం అష్టమ్యాం ఇహాతప్పదూ॥

ల—ఔర! ఔర! ఏం కవులండీ!

గు—అడ్డం ఏమిటీ! గోదావరిలో మునిగితేలిన ప్రతీ పక్షీ కవే!!

63

రాంభొట్లుగారు ఓచోట తేరభోజనం ఊపిరి సలపకుండా వాయించేసరికి ఆయాసం హెచ్చిపోయి, కళ్ళు మూతలడి, తాపం ఇనుమడించగా ఉపశాంతికోసం గోదావరిలోదిగి కంఠంలోతు నీళ్ళల్లో ఉన్న సందర్భంలో ఒక చచ్చిన గేదె కొట్టుకుపోతూ అతణ్ణి తాకగా, అతడు కళ్ళుమూసుగ్గునే తడిమి ఉబ్బిపోయి వున్న దాని పొట్ట గమనించి.

—ఓహోహో! తమరా!

—మీరూ వచ్చారూ?

—(పొట్టఎత్తు గ్రహించి) అయితే మీరు లోపలిబంతివారా?

—వడ్డించేవాడు మీవాడా?

—సరిసరి. వండిందే మీవాడా!

64

పుల్లయ్య—ఏడిశాడు. జానికిరాముడు! గంగయ్యకీ వీడికీ సాపత్యం కూడానా! గంగయ్య వంటకి జింహ లేచొస్తుంది. వాడిచెయ్యి అమృతోపమానం.

కూర్మయ్య—ఆ. చెప్పిచెప్పి గంగయ్యనే చెప్పాలి. చేశాడు మొన్న సంతర్పణకీ! తిన్నాం! - ఎవ్వడూ కిందుమెర్మయ్య లేదు. జానకిరాముడు, గాడి అంటించి, గరిటె చేతపడితే, దేవతలుకూడా పిలవందే భోజనానికొస్తారు, వాడిది భీమపాకం.

పు—ఛీఛీ వాడేమిటి? గంగయ్యేది నలపాకం.

కూ—శోభనమాయే. గంగయ్యేపదూ, జానికి రాముడిది హరిశ్చంద్రనలోపాకం!

65

ఒక సంగీతంమేష్టరు ఒక అమ్మాయికి పాఠంచెబుతూ "కా-మీ-తా, కా-మీ-తా" అనేదాల్లో 'మీ' అనే అక్షరం తరవాత ఒక సంగతి తనగొంతికతో తను వెయ్యలేక ఎల్లాగోపాడి - 'మీ' తరవాత మంచి సంగతి ఉందమ్మా ! అను, అను.

అమ్మాయితండ్రి—అదేమిటండోయ్ : మీరుపాడి వినిపించాలిగాని 'మీ' తరవాత సంగతి ఉంది అనమంటారేమిటి ?

సం॥ మే॥—అయ్యా ! సంగీతంలో ఇరవైయేళ్ళకృషినాది ! రెండువందల గీతం వందవర్ణం త్రికాలాల్లోనూ పాడడం కావేరీ తీరాన్ని నేర్చినవాణ్ణి ! భగవంతుడు ఆకాస్త గొంతిగా ఇచ్చాడు కాడు, నా అంతఊహ ఎవ్వడికీలేదు.

తండ్రి—ఊహాకేం ? జంతువులకీ ఉందేమో ! పాడిం తరవాతేగా గానం !

సం—ఏమోనండి ! ఈకృషేగనక ఇంగ్లీషువంటి దాలో ఉంటే ఏ బియ్యేబియలో చులాగ్గా ఈడ్చేసి ప్లీడరీ చేస్తూండే వాణ్ణి !

తం—(తను ప్లీడరు అవడంవల్ల) అది సునాయాసమనా మీ ఉద్దేశం ? ఒక్కొక్క-క్లాసు ఆరేసేళ్ళు చదివిన ఓపికరాయుళ్ళున్నారు. మీసంగతి అల్లా వచ్చేదేమో !

సం—మరోమేస్తరుగా అనుకోనియ్యరేమిటండీ ! బాగానే వచ్చింది. అల్లాయితే మరోణ్ణి చూచుగోండి, పాఠానికి !

66

శేషశాయిగారికి చారువడ్డించి, ఆయనభార్య మళ్ళీ దేనికో వంటయింట్లోకి పోగా,

శే—అవునే, చూడూ!

భా—(వచ్చి) ఏమండి?

శే—చారెవరు కాచిందీ!

భా—నేనే. ఏం?

శే—ఎవరేనా వెధవ ఆవిడేమో అనుకున్నాను.

భా—ఎంత నిర్దయులండీ! అదా! నిజమే! అదంతా నేనే దాచేసుగున్నాను. అందులో వెయ్యడానికేమీ మిగల్లేదు.

67

కుండనాల వీరావధాన్లు పట్నంవెళ్ళి బంధువులింటో బసచేసి, సాయంత్రపువేళ వీధులు తిరగడంలో ఒకవీధిని ట్రాంపోతూం డగా, ఆపుమని సంజ్ఞచేయగా,

ట్రాంవాడు—(వడితగ్గించి) ఊఁ, ఏరయ్యా, శీగిరం!

వీ—ఏరడానికి నాకేంపట్టింది గాని, ఎదరదార్లో పులిస్తరాకు కూడా ఉన్నట్టుంది. బండీ కాస్త తప్పించి మరీతోలు!

68

ఒక రాత్రి ఒక హరిశ్చంద్ర నాటక ప్రదర్శనంలో, విశ్వామిత్రుడికి మ్రొక్కి,

హరిశ్చంద్రుడు—మునివరా! నాతప్పు సైరింపుము.

వి—ఛీ, మూర్ఖా! ఏలరా ఈ నక్కవినయము! నన్నంటు కుమురా!

అని కోపిస్తూ, లోగడ హరిశ్చంద్రుడు కొంచిన కల్రప్రకారం జరిపే సదుద్దేశంతో అతని కిరీటం ఊడగొట్టి దానికై ఒకతన్ను తన్నగా, ఆ తాపు దూసుకుపోయి, తన కాలికి ఉన్న

పాంకోడు పాపురాయికిమల్లే పైకి ఎగిరి హరిశ్చంద్రుడు నెత్తిని పడబోయినప్పుడు అతడు ఒసిలి తప్పించుకోగా, విశ్వామిత్రుడు ఆ పాంకోడు మళ్ళీ తొడుక్కుని, ఇంకా కోపంతో అతడు కణతమీద తన్నుతూ,

వి—నాదగ్గరటరా, నీ తలవిసురూ.

69

సత్రం గదుల్లో ఒకదాన్లోఉన్న పెద్దమనిషితో,

బాటసారి—తమది ఏవూరండి?

పె—కాకినాడ. ఏం?

బా—ఊరికేనేబాబూ! పేరు!

పె—దోసపాటి నాగారావు.

బా—తమకి ఏమన్నా ఉద్యోగమా అండి?

పె—(పక్కగదిలో మకాంఅయివున్న కలక్టరుగారి భార్యకు వినపడేటట్టు) ఈ గదిలో దిగారేం, ఆ కలెక్టరుగారి సర్కీటు గుమాస్తాని.

బా—తమకి ఏమన్నా సంతానమా?

పె—పింఛను పుచ్చుగున్నతరవాత అడగవలసిన ప్రశ్నలు ప్రస్తుతం అసందర్భం గనక ఊరుకోండి.

70

వాయిస్తూన్న వీణడించి సాగరంగారు ఒకమాటు బైటికి వెళ్ళడం కనిపెట్టి, సభలోంచి ఓఆయన తారాజువ్వలాగ వెళ్ళి "అదేమిటి, అదేమిటి" అంటూ మొత్తుగుంటూన్నా వినిపించుక్షోక, వీణ రెండుముక్కలక్రింద విరిచి అక్కడ పెడుతూండగా వైణికుడు వచ్చి అయ్యో అని నిర్ఘాంతపోగా,

ఆయన—(గర్వంగా చేతులు దులుపుకుంటూ) ఆశ్చర్యం ఎందుకండీ! ఇదో లెఖ్ఖనుకున్నారా ఏమిటి?

వై—నా నడుం విరిచేశావు, పాపిష్ఠీ! పైగా వాగుతా వెందుకూ?

ఆ—గంటనించి చూస్తాను, సంగతే కనిపెట్టలేక పోయావు, పైగా వాగుతా వెందుకూ?

వై—ఏసంగతి?

ఆ—సంగతా! పాతినగుంజ పెల్లగించడానికా అన్నట్టు గింజుకున్నా వేగాని, పట్టుతెలుసుగోలేక పోయావు.

వై—పట్టేమిటీ?

ఆ—పట్టా! టుంయి టుంయి మనిపిస్తే లొంగుతుందా ఇదీ? నేను వాటం కనిపెట్టి మోకాలికి దాన్నిడబాయించి చిటిగెలో టుప్పు మనిపించాను, నువ్వునన్ను మెచ్చక పోతే సరనుకున్నావా?

71

రంగయ్య—వెన్నముద్దగారూ! ధప్పళం ఎల్లాఉందీ?

వె—ఓ ఏం చెప్పను! లంఖణాలముండావాడు అన్నం తినేట్టుంది.

రం—నిజంగా చెప్పండీ!

వె—ఒట్టండీ! స్వర్గానికి బెత్తెడు ఎడంగా వంటఉంటే ఇంకా ఏముటో నిజం చెప్పమంటా రేమిటి?

రం—అహాఁ. మీ అన్నయ్య స్వర్గానికి మూడువేళ్ళ ఎడంగా వంట ఉందన్నాడు లెండి.

వె—అందుకా! సరె. వాడివేళ్ళు లావుతాడు మరి! అంచేత అలా అన్నాడు.

రం—ఓహోహో! మీకు తమ్ములు లేరుకదా అనా మీ ధైర్యం!

72

శంఖయ్య ఒక బస్తీలో ఒక మేడఎదట నిలబడి చూస్తూండగా, అతణ్ణి పదేళ్ళక్రితం కలుసుగున్న పరదేశి అనే స్నేహితుడుకూడా అక్కడికేవచ్చి,

ప—ఇదుగో! ఇక్కడేనా మకాం? చాలాకాలమైంది చూసి.

శం—మరే.

ప—ఉద్యోగమా?

శం—మరే.

ప—ఎక్కడా, ఎందులో?

శం—పోలీసుసంబంధం.

ప—వెడతాను. కచేరీకి వెళ్ళాలిగావును.

శం—అక్కర్లేదు, తీసేశారు. ఈ ఉదయంనించి ఖాళీ.

ప—పనిప్రయత్నం చెయ్యడానికి ఈమేడలోకి పోతావా?

శం—మరే.

ప—వెళ్ళు. పోతాను.

శం—నా వెనకటిపనే సంపాదించాలంటే కొంత రహస్యంగా వెళ్ళాలి. రాత్రి వెడతాన్లే. ప్రస్తుతం నీతోనే వస్తాను, నడు.

73

హరికథ ప్రారంభించబోతూండగా, యజమాని వచ్చి, కేతయ్యదాసుగారి చెవులో,

—అయ్యా! పాలమాటఏమిటి? మీరు మామూలుగా పుచ్చుగోడం ఎప్పుడూ?

కే—తక్షణం తెప్పించండి.

య—ఏం, పోనీ, ఇబ్బందిలేదు. కొంతరంగం అయిం తరవాతే పుచ్చుకోండి.

కే—అహా(. మామూలు ఇదే.

య—ఆయాసంగా ఉంటుందేమో, మామూలు ఇల్లా చేశారేం?

కే—అదా! మీకు చాదస్తంకాకపోతే, అంతా పాలిస్తారూ! తరవాత కిలంఎక్కితే చావాలి. ఇందుకూ, మొదట్లోనే పుచ్చేసు గోడం! మరి చంపక, పట్రండి!

74

ఒక గాన శాస్త్రవేత్త ఓ ఊరొచ్చి పరిచయం సంపాదించి ఒకరింటో పాటపెట్టిన పావుగంట అయేసరికి, ఆయనా, మద్దెల ఫిడేలు వాళ్ళూ స్రుతివేస్తూన్న గృహయజమానీ మిగిలినా, ఆయనమాత్రం పాట మానేసెయ్యకపోడం మరొకపావుగంట చూసి, తనులేచిపోతూ గాయకుడితో,

యజమాని—అయ్యా! తమరు వెళ్ళేటప్పుడు చెప్పి మరీ వెళ్ళండి, తలుపు వేసుగుంటాను.

గా—చిత్తం, వీలైతే చెబుతాను. నిద్దర మన్తో చెప్పివస్తుందా మీకు వెర్రిగాని!

75

ముగుడు—అందకాడూ, సౌందర్యరాశీ, మన్మధరూపీ, గుణ కాడూ అయినభర్త ఉంటూన్నా, ఒక్కొక్క ఆడదానికి ఏం పొయ్యకాలమో!

భార్య—అందకత్తీ, సౌందర్యకటారీ, రతీరూపీ, గుణకత్తీ అయిన భార్యఉంటూన్నా, ఒక్కొక్క మొగాడికి ఏం వినాశ కాలమో !

ము—ఛఛా ! కోప్పడకు ! నేచెప్పేది ఊళ్ళోవాళ్ళమాట !

భా—రామరామ ! మధ్య మీరు గోలెట్టకండి. నేచెప్పేదీ అంతే ! లోకంమాట, మధ్యమపురుష వ్యాపారంకాదు !

76

రత్నం—పుండరీకాక్షుడివి అన్నీ అఘాయిత్యపుపన్లే!

ముత్యం—ఏం ?

ర—ఓసారి ఒకశవం వాడు ఊరికెళ్ళడంమూలాన్ని వారం నిల్చిపోయింది.

ము—ఏం ?

ర—వాడు ఉచితంగా వతనగా దానంచేస్తూండే కటుకు ఇవ్వకపోడంవల్ల ! ఆపళంగా వెళ్ళి వాణ్ణి నానాతిట్లూ తిట్టాం !

ము—వాడు ఊరుకున్నాడూ ?

ర—ఊరుకుంటాడూ ! ఊళ్ళోవాళ్ళ భాతీలన్నీ కొలవడం మొదలెట్టాడు.

ము—ఎందుకో !

ర—తను ఊరికెళ్ళినాసరే అటంకం రానీకుండా ప్రతీవాడికీ అధమం రెండేసి కటుకులు అడ్వాన్సుగా సప్లైచెయ్యడానికి అన్నాడు.

ము—మీరేంజేశారు ?

ర—పోనీ పోయిలోకేనా పనికొస్తాయనుకుని అవన్నీ పుచ్చ గున్నాం.

ము—తరవాత!

ర—వాణ్ణి చావగొట్టడానికి సిద్ధపడ్డాం.

ము—సిద్ధపడి,....

ర—ఊరుకున్నాం. తనస్వంతానికి వాడు ఒకటి రడీ చేసుకున్నాడో లేదో కనుక్కొని మరీ చావగొడదాం అని.

77

రాత్రి భోజనసందర్భంలో తనయింటికి పిలుపుప్రకారం చాలా మంది రాగా వచ్చినవాళ్ళని హెచ్చరిస్తూ, యజమాని, వారిని ఆసీనుల్ని చేస్తూ,

—శాస్త్రం చెప్పినట్టుంది. మన పాటకచేరీ – రావుగారు రానేలేదు.

అనే సమయానికే రావుగారు వీధులోకివచ్చి. లోపల జరిగే సంభాషణ వింటూండగా, వచ్చినవారిలో ఒకరైన ఒకప్లీడరు

—ఏమిటో! ఏదో మీ మంచితనంకొద్దీ ఆ రావు గౌరవార్థం మీరీ ప్రీతిభోజనం పెట్టారనుకోండి, కాని ఆయనది నా మొహం పాట, ఎంపాటండీ, పెద్ద కచేరీ అనడానికీ! ఆయన వేసిన సంగతులన్నీ దవడసంగతులు, పాడినవర్ణాలన్నీ కర్ణకఠోరాలు, ఇన్నతానంఅంతా మేకతానం, అసలు పెట్టినశృతే కీచుశృతి, ములిగిపోలేదు. కూచుందాం, తిందాం పడుదురూ!

అంటూ రావుకోసం ఆగఖ్ఖర్లేదని యజమానికి నచ్చచెప్పగా అందరూ విస్తళ్ళకి అడ్డంపడ్డమీదట రావుగారు లోపలికి వెళ్ళగా ఆ ప్లీడరే నవ్వుమొహంతో,

—అయ్యా. దయచెయ్యాలి. ఇప్పుడే పరిషించాం, మీకేమీ అభ్యంతరం లేదనుకుంటాను.

అనగా రావి కూర్చుని, నెయ్యీ, కూరా, పులుసూ, మజ్జిగా, వెంటవెంటనే కానిచ్చి మిక్కిలిత్వరగా లేవగా,

ప్లీ—అదేమిటండీ? ఇంకా భోజనాలుకాందే! ఆకలి లేదా?

రా—లేకేం? మధ్యాహ్నం మీ యింట్లోనేగా భోజనం మరీ!

ప్లీ—అప్రస్తుతం ఇక్కడ వద్దు. బంతివాళ్ళకి కాందీ లేస్తా రేం? ఇదా మర్యాదా?

రా—ఇతరులు నా కోసం ఆగనప్పుడు, ఇతరులకోసం నే నాగడం మర్యాద అని మీరు చెప్పింతరవాత తెలుసు గున్నాను. కాని ఇక్కడకూడా తమదేనా వకాలత్? హృద యంలో సూట అనేనే స్వభావం మీకుండబట్టి నాకు కడుపు నిండి పోయింది, సెలవ్!

78

పరీక్షసమాధానపత్రాలు కుర్రాళ్ళకి మేష్టరు ఇచ్చేస్తూన్న సమయంలో.

ఒకవిద్యార్థి—నా సమాధానపత్రంమీద మార్కు వెయ్య లేదండి.

మే—ఏమి వేసిఉందిమరి!

వి—ఆశ్చర్యార్థకం వేసిఉంది.

మే—అదీ ఒకమార్కేగా!!

వి—సంఖ్య ఏదేనా ఉండాలిగాని ఆశ్చర్యార్థకం ఎందుకండీ?

మే—అదా నీ ఆశ్చర్యం! లోపలి సమాధానానికీ సంఖ్యలకీ సంబంధం ఏమిటోగదా అనే నా ఆశ్చర్యం తెలపడానికి.

79

చాలామంది కలిసి ఇడ్లీ తింటూండగా, అందులో ఒకడై ఉన్న దీనయ్య రామోజీతో.

దీ—త్రినా! ఏంశాశ్వతం! కరువో కాలమోనూ!

రా—ఏమీభయంలేదు. ఆర్నెల్లవరకూ భయంలేదు. ఆపై పూట చూసుగోవచ్చు!

దీ—ఎమో! అది మాత్రం నీకెట్లాతెలుసూ?

రా—నిన్నరాత్రిచూశాసు, స్పష్టంగా కనిపించింది అరుంధతి.

80

నరసింహం తన అధికారితో,

న—అయ్యా! తొమ్మిది దాటింది. నేను నల్లమందు వేస్తాను. పదికి మళ్ళీ నే నిక్కడ వాలాలి. మరివెళ్ళి రెండుమెతుగులు నోట్లోవేసుగుని చక్కావస్తా!

అధి—(అదంతా దర్జాగా పరధ్యానంగా విని) సరి సరి! ఈ తొందర్లో మీ రెడితే ఎల్లా! భంట్రోతుని వెళ్ళిరమ్మనండి!

81

ఆయవార బ్రాహ్మడు—సీతారామాభ్యాన్నమః!

యజమాని—చెయ్యి ఊరుకోలేదండీ!

ఆ—కనకనే దేవరవారి మీసకట్టుకి ఆ అందం! తక్కినవాళ్ళ చేతులుంటాయిగా బాబూ! సెలవ్!

82

ఒక మంచిఆవిడ ఒక గొప్పవాడితో,

—అయ్యా! మీరు చేసినమేళ్ళు నేను మరవను. మళ్ళీజన్మలో మీకు తల్లినై పుడతాను.

గొప్పవాడు—ఏమో! మీకు వచ్చిన చిక్కును బట్టిన్నీ మీకు నాయందుండే అభిప్రాయం కొద్దిన్నీ అట్లా అంటున్నారుగాని, అది అక్రమం అండి !

83

మంగమ్మ—(రమణమ్మకి జుట్టులేకుండా బోట్టుండడం చూసి) తిరుపతి వెళ్ళొచ్చారాయేం, పిన్నమ్మా ?

ర—లేదమ్మా ! మా మొఖాలకి తిరపతి గూడానా !

మం—మరి కాకపోతే ?

ర—మా వోడియివాఘంలో యియ్యపరాల లాంచినాలు !

మం—అదేమిటమ్మోయి !

ర—ఏమడుగుతావ్ ! ఆళ్ళూ యీళ్ళూ ఘర్సనపడి సివరికి నావొల్లొచ్చిందంట పేసీ, పెళ్ళికూతురోళ్ళు నన్ను కూకోమెట్టి అమ్మాయి పెళ్ళిలో అత్తగారి పుటెంటిగిలు తీయించారు, మద్దెత్తింగాను !

మం—మధ్యస్తంగాయేం ? చివరంటా తీసేశారు, పాపం, వాళ్ళకేం వచ్చిందో !

84

ఎడాపెడా చెంపలు వాయించినట్టు దెబ్బలుతగిలేటట్టు కతకలుగాఉన్న రోడ్డుమీద ఒంటెద్దు బండిలో పోతూన్న ముసలమ్మ బండీవాడితో,

ము—ఇంత కుదుపుగా చెయించి తగలేశారేం నాయనా, బండీ !

బం—చేసిన వడ్లాబత్తుడికి వల్లమాలిన దగ్గండీ : పైగా అతడు చలిజ్వరం పడ్డప్పుడు ఇది చేశాడు.

ము—అల్లాచెప్పమరీ! అతగాడికి అవన్నీ తగ్గిపోయిం తరవాతేనా బండీ బాగుచెయించు నాయనా!

బం—ఆయినిగోరికి అంగుశ్చేదమ్మా! బేరం చెయడానికి వెడితిమో కొండమీదనించి దిగనేదిగడు!

85

మేష్టరు—వెంకయ్యా! మళ్ళీ "లేట్" కాదూ?

వెం—(మెల్లిగా) అవునండి.

మే—ఎన్నోసారి?

వెం—మూడోసారండి.

మే—మొదటిసారి ఏమన్నావు?

వెం—ప్రమాదో

మే—రెండోసారి?

వెం—అవశ్యం అనుభోక్తవ్యం

మే—సరే, ఒప్పుగుని ఆ రెండుసార్లూ క్షమించాను. ఇప్పుడు! ఇప్పుడేమంటావ్?

వెం—అభ్యాసేన - అంటానండి.

మే—అన్నా సరే, క్షమించను!

వెం—ఎందుకు క్షమించరండీ?

మే—ఆంధ్రంలో ఎవ్వడూకుడా క్షమించలేడు గనక!

86

రైలునడుస్తూన్న సమయంలో ఒక యాచకపు బ్రాహ్మడు మూడోక్లాసు పెట్టెలో,

—అయ్యా! శుభోజ్జయం! ఈవేళ అమావాస్యండి, అందరికీ, ఆడవాళ్ళకీ మొగాళ్ళకీ కుడా!

ఒక పెద్ద షాహుకారు—ఆడోళ్ళకీ మొగోళ్ళకీ సరిగాని, యొదవముండలమాట యేంటి సెలవిచ్చావు, బాపనయ్యా!

బ్రా—వెధవ వాళ్ళకీ, మీ బోట్లకీ, తల్లిదండ్రులులేనివాళ్ళకీ, కూడా అంతేనండి. అందరికీ అని చెప్పానుగాబాబూ, క్షమించి వినుంటే - సర్వేషాం.

87

పత్రపురంలో ఒక దాసుగారు చెప్పిన హరికథ పూర్తికాగానే దాన్నిగురించి ఒకరసజ్ఞుడు, సభవారితో, ప్రశంసాపూర్వకంగా మాట్లాడుతూ,

—ఆర్యులారా! నేటిరాత్రి మన హరిదాసుగారు 'రామదాసు' చెబుతూ ప్రకటించిన శక్తికిన్నీ చేసినగానమునకున్నూ మనజన్మ పావనమైంది. వారు మన పుణ్యంచేత మనలనందర్నీ ఒఖ్ఖమాటుగా స్వర్గస్థుల్ని చేసేశారు. (అనగానే, సభలో కొందరు నవ్వగా)

ర—నిజమేనండి, సందేహంలేదు, ఇతర చోట్లగుడా జనాన్ని వారల్లానే చేశారని తెలుస్తోంది!

88

అత్త—(కోడలితో) దెబ్బలాడకో, అవిడ! దెబ్బలాడకు! నే పోతేసరి! పరమాన్నం వండిపెడుదుగాని, ముగుడుగారికి!

కోడలు—అయన ఏమన్నా తెస్తేగా ఇంట్లోది వండడం! నేపోతేగావి తీసుగురారు.

కొడుకు—వండడం నీకు చేతవవుతేగదా! నేపోతేగాని నీకు చేతవదు.

89

శాస్త్రుల్లు—ఏమండోయి, మేష్టారు : నమోన్నమః. మా కుఱ్రాణ్ణి మీస్కూల్లో చేరిపించాను. కుఱ్రతనం ! మీరో కన్నేసి చూస్తూండాలి వాణ్ణి. అల్లా చూస్తున్నారేం ?

మే—ఇద్దరప్పుడే చెప్పేశారండీ ! ఇహ వీలెక్కడుందీ అని చూస్తున్నా !

శా—ఏమి సోద్యెమండీ తమదీ ! అల్లాయితే, వీలెక్కడుందని మాత్రం ఎల్లా చూస్తున్నారూ ?

మే—అదే చూస్తుంటా !

శా—అహాఁ. అసలు నన్ను మాత్రం ఎల్లా చూడగలుగుతున్నారూ అని ! నాదగ్గిర చెబుతారేమిటి ?

90

పళ్ళులేని ముసలమ్మ తెగనములుతూన్నట్టు కనిపించగా, చూసి,

మనమడు—బామ్మా ! నాక్కాత్తెట్టవ్ ?

బా—(బోసినోరు చూపిస్తూ) చూడు నాయినా ! ఏముంది నాబొంద ! ఏమీలేదు !

మ—మరి నువ్వు పెదిమిలు మూసుకు దవడ ఊపుకోకుండా కదుపుతూంటావేం ?

బా—ఆ నమలడమా నువ్వనేదీ ? అవి నీకెట్టడానికి వీల్లేదమ్మా ! అల్లానేను నమిలేది మీ నాయన నాకెట్టిన చివాట్లు, మింగి ఊరుకుందామని ఎంత నమిల్నా మింగుడు పడకుండా ఉన్నాయి.

91

శర్మ—ఈపొట్ట మొత్తంమీద ఉతుకుష్టంగానే ఉంటోం దోయ్, లక్ష్మయ్యా!

ల—ఎదో పోనిస్తూ, దేవుడిచ్చిందికదా! కావాలంటే వస్తుందా నా బోట్లకి ?

శ—అదిసరే! బంధువు లిళ్ళకెడితే, నన్ను మడిగట్టుకో మనడం మానేశారు!

ల—ఆఁ ఆఁ ఎంత అప్రతిష్ఠా!

శ—నాకు ఆకలి సొరేసుగు పోతూన్నప్పుడు కుడా పైకి నా ఉదరం ఉన్నతంగానే ఉండడంవల్లగావును!

92

ఒక సంగీత సావిత్రినాటక ప్రదర్శన సందర్భంలో, యముడు తన రాతిగాత్రంవిప్పి, ఒక సీసపద్యపు తుపానుతో సభవాళ్ళని మొత్తి చాలామంది చెవులు చిల్లులుపడగొట్టి, వచనంలోకి దిగి, సావిత్రితో,

య—సావిత్రీ! నీభక్తికి మెచ్చితి. నీపతి జీవము దక్క వేరొకవరము ప్రసాదించెద, కోరుకొనుము.

అనగానే, ఒకమామూలు పావలాక్లాసు రసజ్ఞుడు, పెద్ద గొంతిగచేసుగుని, సావిత్రి తనకోరిక కోరుకునేలోపల,

—అమ్మాయి సావిత్రోవ్! నీకడుపున పుడతాను గాని; ఆయముడుమాత్రం ఇహపాడకుండా వరంకోరుకుందూ!

93

కూతురు, జారిపడిపోగా,

రత్నమ్మ—నీచావు నేలబడ !

అంటూసాధిస్తూ వేళ్ళు అంటుగునేటట్టు వీపుమీద బాదగా, ఇంటికొచ్చిన వియ్యంకుడు.

—అదేమిటక్కా ! చంటిపిల్లని అల్లా బాదగొట్టేశారే !

ల—మరికిందికి దిగజారి చచ్చిందాయిరి; ఎంజెయ్యను· బాదనా !

వి—ఒహోహో ! అల్లాయితే, మీరు ఆ చిచ్చిన దాన్ని, చచ్చిచెడి బతక్కొట్టేశారన్నమాట ! ఈ మాటు బోధపడ్డది !

94

శంభన్న—ఏమండి ! రామకోటిగారు ( భుజంమీద ఏమిటా· కట్టు !

రా—విన్లే ? మొన్న మావాళ్ళింటో పెళ్ళమంటూ జరిగిన పెళ్లి ఊరేగింపులో అవుటు పేలినప్పుడు తగిలినదెబ్బ !

—అన్నట్టు మీ అమ్మాయికి ఏక్కడేనా ముడెట్టేశావా !

శం—ఆ అందుకనే రాకపోతా ! ఆరాత్రే గుళ్ళో అయింది..

రా—గుళ్ళో ఎందుకు మళ్ళీనూ ! అదే ఇంట్లో కానీక పోయావా !

శం—గుళ్ళో అయితే అధమం దేవుడేనా రాయల్లా మాట్లాడక ఊరుకుంటాడుగదా, ఎక్కడికక్కడికెే, అని !

95

వెంకన్న—కిష్టిగా ! నీచేష్టలు ఊరేగించా ! ఇల్లారా !

కి—(వచ్చి) ఏం ?

వెం—సరేగాని మొహం అటు తిప్పిమాట్లాడు.

కి—ఎందుకూ ?

వెం—ఎందుకా ! నీమొహం చూస్తే అన్నమేనా పుట్టదు.

కి—పుట్టకపోతే అంబలితాగి నవ్యశ్రీనాథుడివి అయిపోదు గానిలే. కాని, నీ మొహం నాకేసే పెట్టు !

వెం—ఎందుకూ ?

కి—అది చూస్తేగాని డోకేరాదు.

96

ఒక నాటకం ఆడడం సందర్భంలో, బ్రహ్మ సరస్వతులు కూచునిఉన్న ఒకరంగంలో, ఒకపాత్ర గబగబావచ్చి బ్రహ్మని శరణుజొచ్చి వరంవేడుకోగా, బ్రహ్మపాత్రవాడు తను ఎం జెయ్యాలో మరిచిపోయి ఊరుకోగా, ప్రాంప్టింగు ఇచ్చేవాడు బ్రహ్మతో సన్న సన్నంగా,

—దేవీ, దేవీ...........

అని అందివ్వగా, బ్రహ్మపాత్రధారి వినిపించుకోకపోగా,

ప్రాం—ఆగంతుకులు వేషా లేస్తే మా ప్రాణంమీదికి తెస్తారు. (అంటూ సణుక్కుంటూ అక్కణ్ణించి కదిలి స్టేజి మేనే జరు దగ్గిరికి వెళ్ళి,)—అయ్యా ! అయ్యా ! మీ బలవంతం మూలాన్ని వేశానని అతనంటాడు. ఇప్పుడు ఛస్తే వినిపించుగో డాయిరి ! అసందర్భం జరిగితే మీరు చంపుతారు. సీను ఆగి పోతోంది. ఏమిటి గతి ?

స్టే॥ మే॥—చెముడేమన్నా ఉందా అతనికి ?

ప్రాం—అబ్బే ! పాంచెవులండీ, మరీ !

స్టే—ఏదీ నడు, అల్లాయితే, నేను చూస్తాను.

అని—పక్కకివచ్చి చూసి,

—ఉయేయ్ ! అయితేనూ, నాలుగు ఉండాలికదాఅని, మనం లోగడ చెయించిన కర్రతలచట్రం తగిలించారా ఏమిటి ?

ప్రాం—మరేగావునండి, లేకపోతే బ్రహ్మవేషం ఒప్పదని !

మే—అల్లా చెప్పూ ! అంచేతే అతనికి చెవులు మూసుగు పోయాయి. బ్రహ్మచెముడు అనేమాట నేటికి ప్రత్యక్షం అయిందిరా, దేవుడా ! తెర వేసెయ్యమను !

97

తెలుగుపండిట్—'అండజము'-అంటే ఏమిటి? నెంబర్ టూ.

నెం. టూ—గుడ్డులోంచి పుట్టింది, అన్నమాటండి.

తె—అనగా ఏది ? త్రీ !

నెం. త్రీ—పక్షి.

తె—లేక—నెంబర్ ఫోర్ !

నెం. ఫోర్—పాము.

ఫైవ్—మేష్టాండి, గాడిదమాత్రం అండజం కాకూడదండీ !

తె—స్వవిషయాలు మనమే నిర్ణయించుగోడం మంచిది.

98

ఒకసిపాయి—భాయీ ! తుపాకీ అనుకోడం నువ్వు కుడి భుజమా ఎడంభుజమా, పేల్చేటప్పుడు !

భా—(జ్ఞాపకం తెచ్చుగుని) కుడిభుజమే !

ఒక—ఏకన్ను మూస్తూంటావ్ ?

భా—ఏకన్నూ మూసుగోను, రెండూమూస్తూంటాను, నేనది అభ్యసించనేలేదు.

ఒక—మరి ?

భా—నే నెప్పుడూకూడా వెనక్కి కొట్టడమే నేర్చుగుంటూ ఉంటాను.

ఒక—సరిసరి. అదేమిటి ? అల్లా ఎందుకూ ?

భా—ఏమో ! ఇక్కడికి నేను చేసిన అయిదారు యుద్ధాల లోనూ కూడా శత్రువులు నన్ను వెనకనించే కొడుతున్నారు మరి.

99

కూర్మయ్య వీధివెంటపోతూ, బ్రహ్మయ్య ఎవడితోనో దెబ్బలాడుతూండడం చూసి, బ్రహ్మయ్యతో,

కూ—బ్రహ్మయ్యా ! ఆగుఆగు ఏమిటసలు ?

బ్ర—చూడు ! ఈవెధవ ముష్టివెధవ నన్ను ఎక్కడి కెడితే అక్కడికి వెంటాడించి, వేధించి, నలుపుగు తింటున్నాడూ !

కూ—(తక్కినవాడితో) ఏం. నిజమేనా ?

త—అబద్ధమండి.

బ్ర—మహామ్మండా, అబద్ధమా ! ఫర్లాంగుదూరాన్నించి ముష్టికి చెయ్యట్టి నా వెనకాలే రాలేదూ ?

త—ఓస్, చెయ్యట్టడమా ! అది చిన్నతనంలో స్కూల్లో అలవాటు ! స్వంత అలవాటు పట్టుగోడం కష్టం. సెలవు.

100

సంబంధాల కోసం తిరుగుతూ, ఒకాయన. ఒక బియేవిద్యార్థి చదువుకొట్టులోకి వెళ్ళి, అతడితో ముచ్చటిస్తూ,

ఆయన—ఇదండి స్థితి !

విద్యా—అఖరమ్మాయికి ఎన్నేళ్ళన్నారూ !

ఆ—తొమ్మిది! కట్నం, ఏ తంటాలోపడి వెయ్యిస్తా. దానికంటె పైపిల్ల ఉంది, రమారమిగా పదకొండేళ్ళది—దానికి మరొహా అయిదువందలిస్తా? దానిపైపిల్ల ఉంది, కట్టుతప్పి, క్షణమేనా ఇహా ఉంచాయిస్తు కాకుండానూ - దానికి రెండు సంచులిస్తా! మరి ఎంజెయ్యేను! దానికి పదమూడూ వెళ్లే పోయాయి!

విద్యా—అల్లాయితే తమవద ఒఖ్ఖ ఇరవై యేళ్ళపిల్లలేదేం పెళ్ళికి?

ఆ—ఇవేంమాటలయ్యా, ఎక్కడో పోఖిరీరకంలా ఉన్నావు.

వి—వెళ్ళండి, వెళ్ళండి! ఊరికేఅన్నాను. మా అమ్మాయి సంబంధం గురించి నేనూ తిరగాలి!

## 101

ఒక జనమందిరంలోని ఆవరణయొక్క ఒకభాగంలో "ఈవైపునకు ఎవ్వరును రాకూడదు" అని రాసిన బల్లకట్టి ఉన్నప్పటికీ, ఒకనాడు చీకటిపడ్డతరవాత, ఇద్దరు గుసగుస లాడుతూ వెళ్ళి అక్కడచేరి మాట్లాడుకుంటూండగా, ఆరోజున శివామని కాఫీకేనా లంచం దొరకని ఒక నెంబరు భంట్రోతు అక్కడికి డ్యూటీనెపంమీద ఏమన్నా వడుకోక్కవచ్చుగదా అని వచ్చి,

భం—ఏయ్! ఎవరిది?

వ్యక్తుల్లో ఒకరు—మేం.

భం—మేమేమిటి? మీరిక్కడికి ఎల్లావచ్చారు?

వ్య—ఈ దారెమ్మటేనడిచి వచ్చాం!

భం—ఇది దారికాదే, "కళ్ళాపట్లా!" అక్కడ నోటీసుంది చూసుగోవాలని తెలియదూ?

వ్య—అక్కడ నోటీసున్నట్టు తెలియడానికి లైటు లేదు, చీకటిగా ఉంది, పైగా మీమనిషేగావును ఓడుండి మేం వస్తూంటే ఊరుకున్నాడు!

భం—అబ్బో! చాలా రూల్సు మాట్టాడుతూండావే?

వ్య—మీరే రూల్సు మాట్టాడింది, ఏంకావాలో చెప్ప కుండానూ?

భం—అల్లాయితే నీ పేరేముటో చెప్పేయ్, రాసేస్తాను, నీ జులుబు ఏమన్నా ఉంటే వొదిలిపోతుందీ!

వ్య—నా పేరు అర్భుదం! అసలు నాకు మనస్సు చికాకుగా ఉంది. ఈవిడ నాభార్య!

భం—(కొంతతగ్గి) అయినాసరే నోటీసుచూడాలి (అని బ్యాటరీలైటు నోటీసుబల్లమీదవేసి), "ఈవైపునకు ఎవ్వరును రాకూడదు" (అని చదివాడు).

వ్య—ఆమాటే నేనూ అంటూంటా! తమరూ వెళ్ళవలి సింది! తమరు అది చూశారు గనక మరియిటు రాకండి!

భం—అల్లాయితే మీ రహస్యాలకోసమా ఈ ప్రకటన?

వ్య—మీ రహస్యాలకోసం అని ప్రకటించి, ఆ ప్రకటన బల్లదగ్గిర లైటుపెట్టకపోయారా? నువ్వెక్కడికి వెళ్ళావ్. గంటనించిలేవే? మానమర్యాద లున్నవాడిచేత నేరం చేయించ డానికి సదుపాయాలన్నీ చేసి, వాడు తను ఆ నేరం చేసినందుకు తనికి గౌరవభంగం జరిగిపోతుందనే భయం చొప్పున ఇవ్వగల

డబ్బులు లాగి, తిని, బలిసి చచ్చిపోయేకంటే ముష్టెత్తుగుని, చిక్కి, శల్యం అయిపోడం గొప్పసంగతి :– ఇదిగో పుచ్చుగో! (అని అణాయిస్తాడు)

భం—(పుచ్చుగుని) తమరు ఆగ్రహిస్తే మేం జీవించడం ఎల్లా ?

102

రైలుస్టేషనునించి ఎనిమిది పైచిలుకు మైళ్ళదూరంలో ఉన్న ఒక ఊరికివెళ్ళేరోడ్డుమీద, పట్టపగలే, ఒక దొంగలగుంపు, గబగబా పరిగెత్తిపోతూన్న ఒక జట్కాబండియొక్క గుఱ్ఱం కాళ్ళు విరగ్గొట్టి, అందులోఉన్న నల్లయ్య పచ్చయ్యలను పక్క డొంకల్లోకి ఈడ్చుకుపోయి, తుపాకులు చూపించి, వాళ్ళతో,

—జేబూలు వెతుక్కుంటాం! కదిల్తే పేలుస్తాం ?

నల్ల—(బిక్కమొహం వేసి) ఒక్కనిమిషం ఊరుకోరూ!

దొం—సరే!

నల్లయ్య అప్పుడు తనజేబులో చెయ్యిపెట్టి ఒక వంద రూపాయల క్రరెన్సీనోటు పైకితీసి, పచ్చయ్యతో ఉత్సాహంగా,

—పచ్చయ్యోయ్! ఎప్పటికప్పుడు ఏదోవోటి వస్తూండడం వల్ల వీల్లేకపోతోచ్చింది! నేను నీకు లోగడ రాసిచ్చిన ప్రామిసరీనోటు మింజుమలె, ఈ నూరురూపాయలూ జమ ఈవేళ యిచ్చినట్టు కాస్తంత వసూలుపెట్టేం! ఇదుగో పుచ్చుగో!

103

శీతయ్య—ఏరోయ్; శాస్తుల్లూ! మీవూరికి రైలు తీసేశార్ట!

శా—అవును, దండగొచ్చిందిట! మీది ?

శీ—వేసిన ఖర్చుకంటె తీసేసేఖర్చు మించిపోతూం దేమో అని వూరుకున్నారు.

శా—ఊరుకుంటేం ? ఎప్పుడో మీదీ తీసేస్తారు!

శీ—మీది దిక్కుమాలివూరుగనక లాగేశారు.

శా—ఒస్ ! మీది చిన్నగాడిరైలు !

శీ—ఛీ! ఊరుకోరా ! రైలుపెట్టి అగ్గిపెట్టిలాంటిదైనాసరే, అసలుందిగా ! పోస్పైకి అర్జీ పెట్టుగోండి !

శా—ఏమో మేం ఎముకలు పొడుంచేసుగోలేం, పోదూ !

శీ—నే అనేదీ అదే ! రైలంటూవస్తే. అస్తికలూ అవీ, పొడుం అయిపోకుండా, తక్షణం మేహాలమీద పట్టి గెల్లి గోదావరిలో కలిపి చక్కారావచ్చు !

104

సోమప్ప—(బ్రేవ్ మని త్రేన్చుగా),

రాజప్ప—ఎక్కడ్రా, ఈవేళ, పట్టూ !

సో—పొట్టిప్లీడరింటో వాళ్ళమ్మాయికి................

రా—పదార్థాలు !

సో—మామూలే !

రా—కూరలు !

సో—ఎన్నైన్నతేం అన్నాను! చెబితే దిష్టి కొడుతుందేమో గాని, అన్నంయావత్తూ ఒక్కవంకాయి కూరతోటే వెళ్ళిపోయిందంటే నమ్మెరి!

రా—ఇహ దిష్టేమిటిగాని నీ పిండం, అది ఏ దిశగా వెడితా ?

105

కాశీ—ఒరేయ్సుబ్బూ! పందుంపుడక కావాలి, తే!

సు—అడితీకి కబురంపు! నీకు పుట్టి ఉండాలి లేకపోతే చాలదు.

కా—ఓహో అదా! నీకు అక్కర్లేదా?

సు—నాకు తెలియకుండా ఉంటుందా?

కా—ఏమో! నీపెళ్ళాం వెళ్లి నాలుగేళ్ళయింది. ఆవిడికి తెలుస్తేచాలదా?

106

సిద్ధాంతి—బావా! ఈ రోజులూ..............ఊహూ వెళ్లి పోతున్నాయిగందా! ఇవి వెళ్లి ఎక్కడుంచున్నాయో, ఎవరైనా చెప్పగల్రేమో!

బా—ఎవరో యెందుకు మళ్ళీనూ! నీకు తెలియదు షోయ్!

సి—నాకా?

బా—అవును.

సి—ఎట్లా?

బా—అవన్నీ నువ్వుచేసి పారేసిన పాతపంచాగాల్లో పడి లేవుషోయ్!

సి—ఓహోహో! అవును! తీద్దాం!

107

గొల్లది—ఇది బేడముంత, పుచ్చుకుంటారమ్మా!

ఆవిడ—నేనూ మా ఆయినా ఇద్దరమే కొస్తే! ఎందు కింతా? పులుపుచిచ్చు పైగానూ!

గో—చెబుదురూ!

ఆ—అవతల పోపు మాడిపోతోంది. ఇంతకి తక్కువైతే పొయ్యనని చెప్పావుంతా!

గో—అడగండి.

ఆ—అర్థణా!

గో—యెల్లవమ్మా! ఆడావు ఆడబేరం! అర్థణాకిత్తే ఋగ్రుకో గల్రేం నువ్వూ మీ ఆయనానూ! అప్పుగత్తే ఎక్కువ కాదు కాబోలు!

108

బిచ్చగాడు—ఏదో మొహమాటం చొప్పున పెద్దలు నలుగురూ సత్కరిస్తున్నారండి.

పెద్దమనిషి—ఏదో పితలాటం చొప్పున పెద్దలు నలుగురూ నన్ను తిడుతున్నారు. నీపనే చాలాబాగుంది. దంచూ! వెళ్ళు!

బి—అన్నంలేనివాణ్ణి బాబయ్యా! ఒక్కకాని దయచెయ్యించండి. మీరు తమలపాకు ఊసేసినంత లేదు!

పె—(తాంబూలం ఉమ్మేస్తూ) నీకు వెర్రిగాని ఒక్కకానితో నీకు అన్నం ఏల్లావొస్తుందిరా?

బి—ఏ టీయేనా తాగుతానండి.

పె—ఏమో ఏంతాగుతావో! నువ్వు ముష్టికేనావస్తా!

బి—అవునండి.

పె—(నౌఖరుతో) ఈమనిషికి ముష్టివేసి పంపించు!

109

తెలుగుమేష్టరు—అల్లుడు అనేమాటకి అర్థంఏమిటి? ఎవరైనా!
శేషు—అల్లేవాడు.

తె—రైట్. అనగా కల్పనచేసేవాడు. అల్లుడుకి తనే అల్లుడైనవాడు ఎవడు ?

శే—విష్ణువు.

తె—అవును. కొడుక్కి అల్లుడైనవాణ్ణి ఎరుగుదురా,విన్నారా?

అందరు—లేదండి.

తె—వినండి. ఒకడికి 63 ఏళ్ళు, వాడికొడుక్కి 42 ఏళ్ళు. తండ్రివెళ్ళి ఒక 24 ఏళ్ళ చిన్నదాన్ని మళ్ళీచేసుకోగా, ఆసంగతి తెలియక కొడుకు బయల్దేరివెళ్ళి ఆచిన్నదాని తల్లిని-39 ఏళ్ళ దాన్ని కట్టుగున్నాడు. అప్పు దేమవుతుంది మరి ?

శే—అవునండి. మరి అప్పుడు ముసిలాడికి ఓకూతురు పుడితే, ఆపెద్దావిడకి ఏమవుతుందండి ?

తెల్ల—పుట్టినపిల్లకి పెద్దావిడ అమ్మమ్మగనక, పుట్టినపిల్ల అమ్మమ్మకి ఆడపడుచు అవుతుంది.

## 110

పాపయ్య—తట్టలో ఏమాత్రం ఉన్నాయి ముంజికాయిలు !

అమ్మేవాడు—మూడుపుంజీలుంటాయి, బాబు !

పా—ప్రతీదానికీ ఉన్నాయా మూడేసికళ్ళూ ?

అ—ఇదిగో మీసిత్తంవొచ్చినట్టు సూసుగోండి.

పా—సరే ధర ?

అ—కాయ ఒక్కంటికి కాని దయసెయ్యండి.

పా—పన్నెండుమూళ్ళా ? తొమ్మిదణాలా ? అరణాలకిస్తే యియ్యి లేకపోతే శీఘ్రంగానడు.

అ—(సందేహించి) రెట్టుకిరెట్టు బాబుగోరు తేడాగా అడుగుతారు. సరే తీసోక్కండి అదేపాయె !

111

అడితీవాడు—మారుజాతిపుడకా మంచిదేనండి, అరితే మా సవ్వరిగా నిల్చి కాల్తుంది.

పెద్దమనిషి—దానంతట అదే!

అ—సిత్తం. మరేమీ పిడకలూగట్రా అక్కర్లేదు.

పె—పిడకమాట కాదోయ్! పుడక మరి బారెడు బారెడు ఉందాయిరి, దానంతట అది నిల్చికాల్తే, కొంప లంటుగుంటాయి గాని తరవాయి ఉండిపోతుందా?

అ—ఆ పనేజరిగితే పుడక ఖర్చు అసలుండదండి, సరుకు యావత్తూ నిల్చిపోయి ఉంటుంది.

112

మేష్టరు—అంబయ్యా, నుంచో, 'గంగిగోవుపాలు'— అప్పగించు.

అం—(ఊరుకుంటాడు)

మే—ఏం?

అం—పితకలేదండి.

మే—ఏమిటీ? చెయ్యట్టు. (అని పట్టినచేతిమీద కొడుతూ) రేపేనా పితుక్కొస్తావా, రేపేనా పితుక్కొస్తావా! (అని రెండు కొట్టి) లేకపోతేను, పితుక్కురాలేదుట, ఏడిశావుగాని, రేపు అప్పగించు!

అం—మానాన్నకి పాలపథ్యంఅండి! మాకేచాలవ్.

113

సీతన్న—ఒడ్డిమంగళ్ళు ఇంతసున్నితంగా తలంటడం ఎల్లానేరుస్తా రంటావు, వెంకయ్యా!

వెం—అఁ ఏముందీ! అభ్యాసం. అభ్యాసంకూసువిద్యా- అన్నాడు.

సీ—అభ్యాసానికిమాత్రం ప్రతిరోజూ రోజ స్తమానమూ వీళ్ళకి తలంటించుగునేవాళ్ళు ఎక్కడ దొరికేడుస్తారూ?

వెం—అందుకనే. ఒంటరిగా కూర్చున్నప్పుడు కూడా రాత్రెళ్ళపొట్ట బాదుకుంటూండడంలో ఆ అంటడపు ప్రజ్ఞ సుసాధ్యం సున్నితం చేసుగుంటూరట.

114

సుబ్బారావు—శంకరం! పెద్దపూర్ణయ్యగారి సిద్ధాంతం గొప్పదా. చిన్నపూర్ణయ్యగారిదా?

శం—ఎందులో?

సు—(చికాకుగా) అబ్బ, అసలు మొత్తంమీదోయ్!

శం—అదా! మనకేంతెలుస్తుంది. అంతగణితం చేసే వాళ్ళలో హెచ్చుతగ్గులు కట్టడానికి గణితప్రమేయమే లేని మనం ఎల్లాపనికొస్తాం? విశేషం ఉన్నవాళ్ళంతా మనమనసుకి సమానులే.

సు—పోవోయ్, చెప్పావ్?

శం—నువ్వేమంటావ్?

సు—చిన్నపూర్ణయ్యగారిది దుర్గ సిద్ధాంతంట. అంచేత గొప్పది.

శం—అదే నే చెప్పిందీనూ. కాశీసంభాషణవల్ల శాస్త్రపరిష్కారమూ కాదు, పరిష్కరణాల యాథార్థ్యమూ తెలియదు.

115

వక్త—(ఉపన్యాసమధ్యంలో) భగవద్గీతలు చెప్పిన కృష్ణుడు వేరు, భాగవతములో చెప్పబడిన కృష్ణుడు వేరు.

శ్రోతలలో ఒకరైన సుబ్బారావు ఆమాటలు విని,

—అవునవును. అందుకనే అతణ్ణి కృష్ణద్వైపాయనుడంటారు. ప్రతీవాడికీ తెలుసు. తమరు కొత్తసంగతులు ఏమన్నా కానీండి.

వ—అయితే, తమర్ని గురించే మాట్టాడాలి.

116

వజ్రాలూ రత్నాలూగురించిన ఒక అడ్వర్టైజ్మెంటు యొక్క రచన ఈక్రింది విధంగా ఉంది:—

తెల్లనివన్నీ పాలుకావు. మెరిసేదంతా బంగారంకాదు. రంగే ప్రధానంకాదు, డబ్బే శాశ్వతంకాదు. మీరు పైడాబు ప్రచారాలు చూసి అక్కడికీ అక్కడికీవెళ్ళి టోపీ పడకండి. మమ్మల్ని ఒఖ్ఖసారి మచ్చుచూడండి, మీకే తెలుస్తుంది.

117

సోమయాజులు—ఊఁ, అల్లాయితే నువ్వు మెడ్రాసులో ప్రతీరోజూ తిరగడమే అందూ!

శర్మ—ఓ.

సో—దేనిమీద?

శ—మెల్లిన్సు ఆహారం మీద.

సో—ఓరి నీ దుంపతెగా, దానిమీద తిరగడం ఎల్లా?

శ—నిజమేరా. మళ్ళీ మాట్టాడితే—చేతితో తాకని-కూడానూ.

సో—ఓరి అదా! టిక్కట్టు ఎల్లా ఉంటూండేది?

శ—కానిదగ్గిర్నించి బేడదాకా.

సో—అల్లా చెప్పూ! ట్రామా!

శ—మరే, కాని నే ఎక్కుతూండే దాని పేరు మాత్రం మెల్లిస్నే.

118

ఓ ముసలమ్మగారు తనయింటికొచ్చిన ముగ్గురు చుట్టాలకి అన్నం పెడుతూ, గరిటె అంటల్లో ఉన్నందువల్ల, రాచ్చిప్పతోనే చారునీళ్ళు వడ్డించబోయి. అది మొదటాయన విస్తట్లోనే ఇట్టీ వంచగా, ఆయన తనకి చుక్కైనా కిట్టక తెల్లపోయిన మీదట రెండో ఆయన తనకి దక్కినబాపతు గబ గబా కలుపుగుంటూ తక్షణం మూడో ఆయన చెవులో,

—ఆవిడ రాచ్చిప్ప నా విస్తట్లో వంచినప్పుడే నువ్వు చెయ్యట్టి సొమ్ముచేసుగో, నీవిస్తట్లో వంచిందాకా తేభ్యంలా చూస్తూంటావా నీ పని అంతే, నీకు ఆనక వట్టి పచారుతప్ప చారుండదు. పైన నీ యిష్టం.

119

తండ్రి—ఇదుగో పంతులుగారు, నమోన్నమః.

పం—చిత్తం.

తం—మా కుంక ఈ యేదేనా మాట దక్కించేనా, కాస్త్రా ?

పం—ఫర్వాలేదండి.

తం—లేకపోతే ఆ దిక్కుమాలిస్కూలిపైను పరీక్ష ఊరుకుంటుందా, మూడోమాటు !

పం—ఫర్వాలేదండి.

తం—అది గనక జరిగితే అక్కడికి మూణ్ణిద్దర్లూ అవుతాయి గనక ధేశాంతరం లేచిపోవాలి.

పం—ఫర్వాలేదండి,

పం—అయితేనూ ముదురు వయస్సువాళ్ళని ఇహ చదివి ఫేలుకానీర్డేం ?

పం—ఫర్వాలేదండి.

తం—ఎమో, మొత్తానికి మీరు నసుగుతూనే ఉన్నారు. మావాడిమాట నిష్కర్షగా చెప్పారుకారు.

పం—ఫర్వాలేదండి, అటు విజయనగరం విశాఖపట్నం లగాయితు ఇటు నెల్లూరూ గూడూరూ వరకూ ప్రతీవిద్యార్థి ప్యాసయితే మీవాడుకుడా ప్యాసు కావాలిమరి.

తం—అంతమంది ఉన్నమీద ఏం పర్వాలేదంటారా ?

పం—పర్వాలేదండి !

120

ఒక సంతలో ఒక అరిటిపళ్ళ దుకాణదారు. కాలిమీదకాలు వేసుగు కూర్చుని, మీపాలు దిద్దుకుంటూ, లోగడ తను పది హేనుసార్లు కొనుక్కునే వాళ్ళమీద ప్రయోగించి నెగ్గినట్టే అప్పుడూ నెగ్గాలనుకుని, ఒక పంతులుగారొచ్చి వేళ్ళాడగట్టిన అరిటిగెలలలో ఒక గెలలోనిపళ్ళు చెత్తోముట్టుగుని నొక్కి పరీక్షిస్తూన్న సమయంలో,

దు—(హేళనగా సకిలిస్తూ) జాగర్తండి, పంతులుగారు! పళ్ళురాలగలవ్, జాగ్రత్త !

పం—(కంగారుపడక, చిరునవ్వుతో) అన్నట్టు నిజమే నయ్యోయ్ ! నీపళ్ళురాత్తే నాకేం లాభం ! జాగర్త అవసరమే !

121

శేషగిరి—మీది ఏ జిల్లా ?

చంద్రగిరి—వెనక గోదావరి. ఇప్పుడు కృష్ణ.

శే— గోదావరికి తూర్పుది అంతా తూర్పుగోదావరిట, పడమటది అంతా పశ్చిమగోదావరిట.

చం—అయితే నాది పూర్వగోదావరి కాదు.

శే— అది సరేనోయ్! అదికాదు నేననేది. అసలు గోదావరి జిల్లా ఎక్కడుం దిప్పుడు?

చం—గంగలో.

శే—అది పాతాళంలోకి ఇగిరితే?

చం—నేతిలో.

122

అంతర్వేది తీర్థంలో కమలమ్మ అనే ఒక వితంతువు మారుగుడు అయిపోయినప్పుడు వాళ్ళవాళ్ళంతా కలవిలపడి ఆవిణ్ణి వెతికి పట్టుగోవాలని యత్నిస్తూండగా, శివరావు అనే ఒకాయన వాళ్ళ దగ్గిర్నించిపోతూ,

శి—ఏమిటండి?

వాళ్ళలో ఒకడు—మాతాలూకు ఒకావిడ తప్పిపోయిందండీ!

శి—ఆవిడపేరు?

వా—కమలమ్మ.

శి—ఆవిడ పునిస్త్రీయేనా?

వా—కాదండి.

శి—అల్లాయితే మీకంగారు బంగారుగానూ, అక్కడా అక్కడా దేవుళ్ళాడతారేం, ఛంగున రాచిప్పల దుకాణంమీదికి వెళ్ళపడక!

వా—రాచిప్పలు కొనడం నిన్న అయిందండి. వెడితే లాభిస్తుందా అని.

శి—పోనీ స్వాములవారు హరిదాసు ఒకడొచ్చాట్ట. ఆయన కథేమిటో కనుక్కుని పట్టుగోండి.

వా—(అంతమాట వాళ్ళవాళ్ళని అన్నందుకు కోపంవచ్చి) ఎంత ఖోగట్టా చేసొచ్చారు మీరు శ్రమపడీ!

శి—మీ శ్రమ ఒకటీ నాశ్రమ ఒకటీనా అండి!

123

మే—ఒరేయ్. సులేమాన్!

సు—సార్.

మే—నీపలకేదిరా?

సు—నాది పలక్క చిర్గీ పోయిందండీ!

మే—హారి! నీ పలక పుడక?

సు—హేష్టీ సెయ్యన్ అండి, పలక్కపుడక్క తెగిపోయింది.

మే—ఓరి నీభాష పట్టంకట్టా! పోనీ పుస్తకంఏదిరా?

సు—పుస్తం యిర్గీ పోయిందీ అండీ!

124

తండ్రి—ఏమండోయ్, ప్రయివేటుమేష్టారు! కనపట్టంలేదే!

ప్ర—చిత్తం పరీక్షలు అయినాయి కావండీ.

తం—ఈ యేడు ఎల్లా ఉన్నాయిష?

ప్ర—మామూలుగానే ఉన్నాయండీ.

తం—లెక్కలపేపరు మహాకష్టంగా ఇచ్చాట్ట వాడిమొహం ఈడ్చా!

ప్ర—కత్తి దెబ్బకింద స్పష్టంగా తేల్చవలిసొచ్చేవి కష్టం అంటాన్లెండి.

తం—మావాడి లెక్కలు ఎల్లాఉన్నాయి ?

ప్ర—ఏమోనండి, పరీక్షతరవాత మీవాణ్ణి కలవలేదు. ఎన్ని చేశానన్నాడేమిటి ?

తం—అన్నీట.

ప్ర—చెయ్యడం అంటే రైటుఅన్నమాటండి.

తం—అల్లానా అండీ! 'నాలుగు చేశానునాన్నా! నాలుగూ ఎక్కాల్లాంటివి. నాలుగురెళ్ళెనిమిది, ఎనిమిదైదులు నలభై! రావలిసింది అంతకంటె తక్కువే. అంచేత ప్యాసైతీరాలి' అన్నాడు. అల్లాచూస్తారేం? అవుతాడా ?

ప్ర—విధిగా, మీవాడి మాటే లెఖ్ఖండీ!

125

వెంకట్రాయలు—ఏమోయ్! సబ్బుమహాశయా! కనపడ్డావే! నిన్న మీస్నేహితుడితో కలిసి కారెక్కి తిరుగుతున్నావే ?

సు—ఎన్నిగంటలకి ?

వెం—సాయంత్రం నాలుగింటికి.

సు—అంతేకద! రాత్రిపదింటికి తెలివితప్పి తిరగమంటావా నాతో!

వెం—అదికాదోయ్ నేనంటా!

సు—అదేనోయ్ నేనంటా!

126

కొత్తగా మేష్టరీలోకిదిగి ఒక కొత్తపాఠం క్లాసుకి బోధించాలని వచ్చిన ఒక తొందరమేష్టరు, ఇల్లా మొదలెట్టాడో లేదో:

ఒకడు—మేష్టాండి, ఔటికండి,

మే—వెళ్ళి త్వరగా, రా, ఇక్కడున్నట్టు.

మరోని మిషానికి.

మరోడు—రెంటికండి.

మే—ఛీ, వెళ్ళిరా, సూన్.

మరొక కాస్సేపట్లో మూడు వేళ్ళు చూపెట్టి.

ఇంకోడు—మేష్టాండి.

మే—ఏమిటి వేలంవెఱ్ఱి ! మూడంటే ?

ఇం—మంచినీళ్ళకండి.

మే—వల్లకాదు, (అని పాఠం అందుకో పోగా)

వేరొకడు—మేష్టాండి. నాలుగువేళ్ళు పెడితే అన్నాని కన్న మాటండి.

మే—అబ్బా ఏమిఅర్థాలూ ? (అని వాణ్ణి సమీపించి) ఇది అయిదు (అంటూకొట్టి) తెలిసిందా ?

వే—(కోపంగా) ఎందుకండి కొట్టడం ? నాలుగంటే నాలుగు వేళ్ళూ లోపలికి వెళ్ళడం అని నేనంటేనూ ?

మే—ఒస్ అదా ! నేనూ అంతే. అయిదువేళ్ళూ అంటుగోడం గదా అని అయిదు అన్నాను.

వే—(ఏడుస్తాడు.)

మరోడు—ఏడిచినట్టుండడం ఇదే అంటున్నాడండి వీర్రాజు.

మే—చాటున అనేకం అనుకుంటారు. మధ్యనువ్వు అరవకు

127

ఆడలాయరు ఒకావిడ ఒక కేసులో సాక్షిని 'క్రాసు' పరీక్ష చేస్తూ,

—ఈసంవత్సరం మార్చి పన్నెండోతేదీ రాత్రి ఒంటిగంటకి నువ్వున్నది ఎక్కడ ?

సా—(జడ్జితో) స్వంత భార్యకూడా అడగడానికి తాఖతులేని ప్రశ్నలు ఒక్కేనవాళ్ళు మొగాణ్ణి అడగడం న్యాయంకాదని ఆర్డరు వెయ్యవలిసిందిగా కోర్టువారి ఘనతనుగూర్చి ప్రార్థిస్తున్నాను.

128

ఒకపెద్దమనిషి పొరుగూరువెళ్ళి అక్కడ ఒక లైబ్రరీ భవనంలో ఉన్న గుమాస్తాతో కొంతకొంత మాట్లాడి,

పె—అల్లాయితే పోతన్న లేనట్టే ! పోనీ సూరన్న ?

గు—ఉహుం.

పె—సోమన్న ?

గు—అబ్బే ఉఁహుం.

పె—తిక్కన్న ?

గు—అయ్యో చాదస్తమా ! తిక్కన్నాలేడు తిమ్మన్నాలేడు. ఈకాలం చదవడాని కొస్తారూ పిల్లలూ ! ఆ యెదరగుండా ఉండే కాఫీహోటలుకి పోయి విచారించండి. వాళ్ళక్కడ దొరకచ్చు.

129

నీతిపాఠం చెప్పదలచి క్లాసుకెళ్ళి ఓమేష్టరు కూర్చుని మొదలు పెట్టడంలో,

మే—ఈవేళవిషయం ఏమిటి ? నెం. 1 ?

1—'అబద్ధాల కోర్లు'

మే—ఆవిషయం ఎక్కడేనా ఎవరేనా చదివారా ?

6—(నుంచున్నాడు).

మే—దాన్ని గురించి ఈవేళ పేపర్లోపడ్డ విషయం చూశావూ ?

6—చూశానండి.

మే—అల్లాయితే నిన్నుగురించి మాట్లాడితే చాలు.

2—ఎంచేతండి ?

మే—ఈవేళ పేపర్లో ఆ విషయం లేదుగనక !

3—అల్లాయితే మిమ్మల్ని గురించే మీరు ముందు మాట్లాడండి.

130

తన క్లయంటుని ఇంటిదగ్గిర తయారుచెయ్యడంలో ఒకప్లీడరు క్లయంటుతో ప్రసంగిస్తూ.

ప్లీ—సరే. దెబ్బలాట అవుతా సరిగ్గా ఎవరెవరికీ ?

క్ల—మామేనగోడలు మొగుడు ఓడున్నాడండి, మాంచి మారీచుడంటివాడు. అదిగో ఆ వచ్చినాడు నావొళ్ళు హూనం అయేట్టు నన్ను కుళ్ళబొడిచి వొదిలిపెటాడు.

ప్లీ—ఒక్కడే !

క్ల—చిత్తం.

ప్లీ—ఇద్దరుముగ్గురయితే మనకేసు మహాబలంగా ఉండునే !

క్ల—అబ్బే ! అల్లా యెల్లా కుదురుతుందీ ? మా మేనగోడలు ఒక్కత్తేకూడాను !

ప్లీ—అదోటా ?

క్ల—మరేమిటనుకున్నారు ! నాకు ఈ మాత్రం తోచక పోలేదు !

131

అంబి—ఒరేయితంబీ ! ఆరామసింగుకి పాటారాదు నా మొహంరాదు. పెద్దగాయకుడన్నావే !

తం—ఏమోమరి! వాడికి గాయికంవచ్చి అయిదారేళ్ళయింది.

132

ఒకదొడ్లో తాడినిఉన్న ముంజికాయల దొంగతనానికి వెళ్లిన నలుగురిలో గట్టివాణ్ణి ఒకణ్ణి కడమముగ్గురూ ఓడిమీద ఓడు వీధులో నిలబడి గోడెక్కించిన తరవాత వాడితో,

ఒకడు—జాగ్రత్తరోయ్! గోడమీదపిల్లివాటంగా ఉండు,

గట్టివాడు—సరేలేస్తూ, మహా!

అని, గోడమీద నుంచుని అందుతూన్న గెలమీద చెయ్యి వేసే తొందరలో మదురుతాటాకు చీకుతాటికమ్మమీద కాలెట్టి దభేలుమని దొడ్డోకి పడిపోగా, వీధులో తక్కిన వాళ్ళతో మెల్లిగా,

ఒకడు—ఒరేయి, గెలడిందిరోయ్!

అని, గట్టివాడు మదురుమీద ఉన్నాడుగదా అనుకుని. వాడితో,

—నువ్వుకూడా తాడమ్మటే దిగివచ్చి నిమ్మళంగా తలుపు తీరా.

గట్టివాడు తలుపువెంటనే తియ్యగా, వీళ్ళు లోపలికి చొరబడి,

—ఏదిరా గెలా?

గ—(మూలుగుతూ) నేనేరా పడతా! నడుంపోయింది!

రెండోవాడు—(మూడోవాడితో) ముంజికాయల సంచీ ఏదిరా?

మూ—(ఇస్తూ) ఇదుగో.

రెం—(గట్టివాడితో) ఇందులో కూచోరా, మోసేస్తాం!

గ—మొయ్యండి గాని, కత్తిమాత్రం దూరంగా పెట్టండి! సంచీలోని ముంజికాయలేమో అనుకుంటే, సెలిగేస్తారు!

133

ఒక డాక్టరుకీ, ఒక ప్లీడరుకీ చాలా చనువు అవడంచేత ఒకరి నొకరు వేళాకోళం చేసుగోవడమూ మాడ్చుగుంటూ ఉండడమూ మామూలై, ఆ డాక్టరు కోర్టులో బోనులో నిలబడి సాక్ష్యం ఇవ్వవలసి రావడమూ ఆ లాయరే అతణ్ణి 'క్రాసు' చేస్తూండడమూకుడా జరుగుతూ రాగా,

ప్లీ—(బోనులోనుంచుని సాక్ష్యం ఇస్తూన్న డాక్టరుతో) డాక్టర్లు ప్రమాదాలు చేస్తూంటారు కాదూ?

డా—చిత్తం. ప్లీడర్లు ప్రమాదాలు చేస్తూన్నట్టే.

ప్లీ—అడిగినదానికి మాత్రమే సమాధానం చెప్పండి. అధికం వద్దు.

డా—చిత్తం.

ప్లీ—డాక్టర్లప్రమాదాలు భూమిలో పాతేస్తారుకాదూ?

డా—చిత్తం.

ప్లీ—ఏమాత్రంలోతున పాతేస్తారూ?

డా—ఎంతఎత్తున ప్లీడర్లప్రమాదాలు గాలిలో వేళ్ళాడదీస్తారో, అంతే లోతున!

134

తెలుగుశాస్త్రి—'అతిశయోక్తి' అంటే ఏమిటి? రామ్రావ్.

రా—గ్రాండ్ గ్రాండ్‌గా డాబడం.

తె—నీకు ఇంగ్లీషుముక్కలు కేవలం పటిగిబెల్లపుముక్కలు. అడ్డమైనప్పుడూ అవి కటుకూకటుకూ నముల్తావు. ఉదాహరించు.

రా—కొందరు కొందరు రాసిరాసి 'ఇల్లారాయడం అతిశయోక్తి కానేరదు'—అంటూంటారు. అవన్నీ ఉదాహరణలే నండి, అతిశయోక్తికి.

శా—వినండి, కడం అబ్బాయిలు. ఇతనిమాటలే సరియైన అతిశయోక్తులు.

135

అవ్వగారి హోటలులో రాత్రి భోజనసమయాన్ని వడ్డన అయినతర్వాత భోక్తలలో దిట్ట అని పేరుపొందిన,

భీమయ్య—అవ్వా, అభీరించు పరిషంచేస్తాం.

అ—రాత్రిళ్ళు అభిఘారణ అవసరంలేదు, నాయనా, పరిషేచన కానీండి.

అనగా, వాళ్ళుపరిషించి కూరకలుపుకోగానే, అవ్వవచ్చి అతిజాగ్రతగా నెయ్యిరాల్చగా, భీమయ్యకి అవ్వని చంపేద్దాం అనేటంత కోపంవచ్చినా, చేసేదిలేక, పక్కవాడికి సంజ్ఞచేసి తలవెంట్రుక ఓటితెంపి విస్తట్లో పారెయ్యగా, సంజ్ఞ అర్థమై,

పక్కవాడు—అయ్యొయ్యో! తలవెంట్రుక వచ్చింది. అవ్వా! ఒక్కమాటు అభీరించు.

అన్నమీదట, అవ్వవిసుక్కుంటూ ఒట్టిపొడిగరిటే పట్టుగొచ్చి విస్తట్లో ఇట్టీఅని చక్కాపోగా, మళ్ళీ పచ్చడి కలుపుగునేటప్పుడు నెయ్యి తప్పదుగనక పట్టుగొచ్చి అవ్వ వెయ్యబోతూండగా.

భీ—అబ్బబ్బ ! తేలు, తేలు—

అని, తనకుడి అరచేతికేసి చూడడం అభినయించిన పిదప, అవ్వ, దీపంవత్తి ఎగసందోసి భీమయ్యచేతికి దగ్గిరిగాపెట్టి,

అ—అబ్బే ! భయపడకునాయనా ! చేతిలో తేలూలేదు, జెర్రీలేదు. ఏమీలేందే !

భీ—(కోపంతో) ఏమీలేదనే నేనూ అంటూంటా ! ఏమీ లేదు, నెయ్యీలేదు. తిన్నగా నెయ్యివేస్తావా, మరేమన్నా కావాలా !

136

కాఫీహోటల్లో ఒక కాఫీపాయి తన కాఫీ తిరగాబోర్లా పోసు గుంటూ పక్కాయన మొఖంకేసి చూసి,

కా—కళ్లెర్రగా ఉన్నాయేమండీ ?

ప—రాత్రి, నాటకానికి వెళ్ళానండి.

కా—ఏం నాటకం ?

ప—భీమాంజనేయం.

కా—ఎల్లా ఉంది ?

ప—వాళ్ళ మొహంలాఉంది. చెప్పుచ్చుగుని కొడ్దామను కున్నానుగాని, కొట్టలేదు.

కా—ఏం ?

ప—అప్పుడు నా కాలిని జోడు లేకపోయింది.

కా—ఆరెరే, అప్పుడు నాకాలికి కొత్తపై జాళ్లు సిద్ధంగా ఉన్నాయిస్మండి. ఆ క్షణంలోనే మీరు నా దగ్గిరికి రావలిసింది. స్లైషోక్తి.

137

క్షౌరప్రసంగంవచ్చి, స్నేహితులతో,

కిష్టారావు—మామంగలి క్షౌరంచెయ్యడం ముగించిన తక్షణం మొహంచూస్తే. నిన్న చేసినట్టుంటుంది,

అప్పారావు—మావాడు క్షౌరం కానిచ్చిన మొఖాన్ని పరిశోధించినా సరే, అసలుక్షౌరం చేసినట్టే ఉండదు.

సుబ్బారావు—మామంగలి క్షౌరంచేసిన మొహం రేపఎల్లుండి క్షౌరం కాబోయే మొహంలాగ ఈవేళే ఉంటుంది. పైపెచ్చు! నిమిషం!

138

సినీమాలో ఒక కథపట్టు ముగిసే సందర్భంలో మోటారు కారు ఒకటి జనంతోసహా అమాంతంగా పర్వతాల మీంచి దొర్లి సముద్రంలోకి పడిపోగా ప్రేక్షకుల్లోఉన్న ఒక శాస్త్రి పక్కనున్న బంధువు రావుగారితో,

శా—(చప్పరిస్తూ) ఆఁ, బూటకం, అసంభవం. అంతమంది చచ్చిపోతారా ? అబద్ధం.

రా—ఇందాకట్టించి జరిగిందిమాత్రం అబద్ధంకాదా ?

శా—(కొంచెం చికాకుపడి) అవుననుకో!

రా—అయినప్పుడు నీకు బాధ ఎందుకూ ?

శా—(కాస్త ఆలోచించుగుని, ఏదో ఓటి చెప్పదలచి) ఈ అబద్ధం మరీ కారురకం!

139

అరణ్యం—ఆరి! ఏమీ సర్కస్‌రా! అన్నీ ఓ యెత్తూనూ, మొన్నరాత్రి, ఆమోటారు 'జంపు'–దాటు–ఓయెత్తూనూ! అత

నెప్పుడూ అందుకు సిద్ధం అయేఉంటాట్టస్మే, 'విల్లూ' అదీ రానేసి!

కాంతం—నువ్వు విన్లేదూ! పాపం వాడు గతించాట్ట, పట్నంలో, ఈవేళ.

అ—పోయాడో, ఉన్నాడో: పనిలోఉండే కష్టాన్ని బట్టి, ఎప్పుడో, ఓనాడు వాడు ఎల్లానూ పోవలసినవాడేగదా అనుకుని, తమఊర్నించి వెళ్ళిపోడంతోటే పోయాడు అనేస్తూంటారు. జనం! కాని, మొన్నరాత్రి వాడితస్సగొయ్యా!

కాం—వాడోడూ! ఆ ఒంటిచక్రం సైకిల్‌వాడు, వాడు రొండోమాటొచ్చాడు. చూశావూ, వాడికాలు మడతకుడా పడిందీ!

అ—(మొఖం కొంచెం పొగచూరినట్టై) వాడా! నేనూ, అప్పుడూ, అవుటికి వచ్చాను. కాని, వాడు మూడోమాటు వచ్చాడేం, అప్పుడు ఒళ్ళుపులకరించి పోయిందిష్మీ!

కాం—వాడు మూడోమాటు అసలు రాలేదు కాదురా!

అ—(చికాకుఅపుగుంటూ) మూడోమాటు రాకపోవడ మేమిట్రా? నిక్షేపరాయిడల్లానచ్చాడు. అప్పుడు నువ్వు అవుటికి వెళ్ళావేమో, జ్ఞాపకంచేసుకో!

కాం—కూచున్న చోట్నించి నేను కదల్లేదు, రెప్పవెయ్య లేదు, అవుటికి అనేమాట స్మరించలేదు.

అ—(వెళ్ళబోతూ) వస్తానుండు.

కాం—ఎక్కడికీ?

అ—అవుటికి. ఇతరులపన్లు నేను ఎన్ని చెయ్యటంలేదూ?

కాం—నువ్వు అసలు వచ్చావా సర్కస్‌కి?

అ—నేనా, బోలెడొచ్చాను. నేవచ్చినంత ఎవ్వడూరాలేదు.

కాం—వస్తే కోపమెందుకూ? వచ్చి మొత్తంగా అవుటి కెళ్ళావేమో జ్ఞాపకంచేసుగో?

అ—అది జ్ఞాపకంరాకనే, ఇప్పుడెడుతున్నానోయ్ అవుటికీ! ఇహ ఊరుకో, ఎల్లాగైతేం నేర్చావు సర్కస్ కబుర్లూ!

140

చిన్నప్ప—శేషాయిగారూ, ఈమధ్య ఊళ్ళోలేనట్టున్నారు!

శే—చిత్తం. సర్వమూ బ్లాక్‌మార్కెట్ కదండీ! అందుకని తిరగవలసొచ్చి తిరుగుతున్నాను. ఎక్కడా అనకండి, దక్కాలి గాని, చిలుం వొదిలింది.

చి—ఏమిటీ గ్రంథం?

శే—మా కుర్రాడు పరీక్ష కెళ్ళాడు.

చి—దానికీ బ్లాక్‌మార్కెట్‌కీ సంబంధ మేమిటి?

శే—అయ్యో మీ అజ్ఞానమా! పరీక్షపూర్వం ప్రశ్నపత్రాలు అర్జించేటప్పుడు; సమాధాన పత్రాలు రాస్తూండేటప్పుడు; రాసిం తరవాత అవి పోస్టులోనూ రైళ్ళలోనూ ప్రయాణించేటప్పుడు; అవి చిల్లరపరీక్షకుడు అధీనంలో ఉన్నప్పుడు; అవి టోకు ఆసామీని చేరుకున్నప్పుడు; వాటి వయినాలు ఖాయం కాబోయే టప్పుడు, ఇలాగ్గా పొడుగునా, చిన్నచిన్న పరీక్ష మొదలు మహా మహా పరీక్షల చివరదాకా బ్లాక్‌మార్కెటే.

చి—అదా! మనుషులుంటే మోసాలుంటాయి. మోసాలు ప్రతీదాల్లోనూ ఉండగలవ్. ఉంటేం? ఈమోసాలకి మరోపేరు ఛూడండి. బ్లాక్‌మార్కెట్ అంటారేం?

శే—మరోపేరెందుకూ? మార్కెట్‌లో మార్కుల ప్రమేయం లేదా, బ్లాక్‌లో సిరాస్ఫురణలేదా?

141

ఒక భవనంలో జరుగుతూన్న సమావేశం గురించి వీధివెంట పోతూన్న ప్రసాదం, ద్వారందగ్గిర నిలబడ్డ ఒకావిడతో హేళనగా,

ప్ర—ఏమండీ! ఇది ఫక్తు ఆడంగుల మీటింగా?

ఆవిడ—అబ్బెబ్బే, కాదండి. ఆడంగులేకాదు, ఏడంగులైనా వెళ్ళచ్చు. వొత్తిడంగుల్నికుడా పంపిస్తూనే ఉన్నాం. మీరూ దయ చెయ్యచ్చు.

142

కల్యాణం—అయితేనూ, అవధాన్లు మీవాడి కీమధ్య వివాహం అన్నాడు, నిజమేనాయేమిటి, భీమప్పగారూ!

భీ—ఏదండీ! ఇంకా కలిసిరాలేదు. చూస్తున్నాం. ఓటి నేడో రేపో ఖాయ్తుపడేటట్టుంది. మూడుముళ్ళూ పడాలి, అనుకోవాలి.

క—కట్నం?

భీ—రెండు పిల్లికూనలవరకూ చెబుతూన్నాం.

క—లాంచనాలు?

భీ—(తగ్గుస్థాయిలో) మీకు తెలియదా యేమిటి? మేమే ఆడపిల్ల వాళ్ళకిస్తూన్నది. మా మూడోవాడికి కాదూ, కొంచెం అవసరం ఉందీ!....ఏది!....అందుచేత నాలుగోవాడు ఇదివరకే ఓయింటివా డయాడుగా.

క—ఓహోహో! అదా! సరిసరి! పిల్లవయస్సూ!

భీ—ఏం జెప్పనూ? మూడుగాళుపులూ గడవలేదు.

క—అందుకనా, ఓపిల్లకూన తగ్గించారూ ?

భీ—మరే. యధార్థం అంతే.

143

శ్రీరామనవమి ఉత్సవపు హడావిడిలో ఒకపందిట్లో హరిదాసు ఒకాయన, దండవెయించు గోవడమూ ప్రార్థనా లాంటి లాంచ నాలూ అయినతరవాత, ఇంకా పాటా మాటాలోకి దిగాడోలేదో, అప్పుడే కొంప మునిగిపోయినట్టు ఆట మొదలెట్టి వెనకాల బల్ల ఉందో లేదో గమనింపులేకుండా జరిగిజరిగి దిమ్మతిరిగేటట్టు వెనక్కిపడిపోగా,

ఒకసభ్యుడు—అయిందా అక్కడికి. నిమ్మళంగా లేవండి. భక్తి ప్రకటించడానికి పిప్పిగంతులేస్తే ఏమవుతుంది మరీ!

అప్పుడాయన మెల్లిగా మళ్ళీ బల్ల ఎక్కబోతూంటే,

మరోసభ్యుడు—వెనకంజ వెయ్యకండి మిత్రమా! మీరు, ముందుకొస్తే చూడాలని మేం కూర్చున్నాం.

హరిదాసు—(కాస్త తేరుకుని) నమస్కారం. మీరే మీరు జట్కావాళ్ళే జట్కావాళ్ళు. ఇతరులు ముందుకొస్తే చాలని మీరూ, పైకొస్తేచాలని జట్కావాళ్ళూ తాపత్రయపడుతూంటారు. కృతజ్ఞుణ్ణి.

144

భద్రాద్రి—ఒరే! మోహనం! నిన్నరాలేదే సినీమాకీ ?

మో—ఊళ్ళోలేను. వేసంగికాదూ, రాత్రి ప్యాసెంజరుమీద వెళ్ళి ఉదయాని కొచ్చాను.

భ—అల్లానా! మంచిపనిచేశావు. మధ్యాన్నం రైలూ బాగానే ఉంటుందికాని, ఆగినప్పుడల్లా ప్రాణపోకటే ?

మో—నిశ్చయంగా అంతే. ప్రాణానికీ రైలుకీ ఏం బాంధవ్యమో కాని, రైలుపోతూంటే ప్రాణం నిలబడుతూంటుంది, రైలునిలబడితే ప్రాణం పోతూంటుంది.

145

ఒకసాయింత్రం ముగ్గురు డచ్చీలరాయుళ్ళు సముద్రపుపోరకూచుని కబుర్లు చెప్పుగుంటూండగా,

ఒకడు—(నిదానించి చూసి) అల్లా తూర్పుగా దిక్చక్రంకేసి చూసి ఏముందో చెప్పుకోండి.

రెండోవాడు—ఏముందీ నీ మొహం!

ఒ—ఓరి ఇదిట్రా నీతెలివీ?

మూడోవాడు—పెద్ద దీపస్తంభం ఉంది.

రెం—ఇంకా ఏమడుగుతున్నావో అని ఊరుకున్నాను. అసలు నే నది ఇందాకానే చూశాను. అదుగో దానిమీద కాకివాలిఉంది.

మూ—(చెవిఒగ్గి వినడం నటించి) నిజంరా! ఆ కాకి శ్రావ్యంగా నిషాదం ఆలపిస్తోంది.

ఒ—ఇప్పుడు నువ్వు వింటూన్న నిషాదం పేరే కాకలి నిషాదం!

146

రంగశాయి—వెళ్ళావురా, పాటకచేరీకి?

రత్నం—ఆ.

రం—ఎల్లాఉంది?

ర—ఆయన భల్లూకంలా ఉన్నాడు.

రం—పాట వింటాంగాని, చూడంకదా. ఆయనసరే. పాట మాట నేననేది ?

ర—చాలా గొప్పపాటట.

రం—'ట' ఏమిటీ ? నువ్వెళ్ళానంటున్నావుగా !

ర—వెళ్ళాను, వెడితేం ? కొందరు ముందు కూచున్న వాళ్ళకి ఆయన శాస్త్రం తెలిసిందిట ఆహాహా అంటోచ్చారు.

రం—అర్ధమేమిటో తేల్చనక్ఖర్లేదుగనక, అల్లా అంటూంటార్లే గానశాస్త్ర మొహమాటస్థులు, నీమాట ?

ర—మేం అంతాకలిసి భజన ఫక్కీని చాలాగోల చేశాం,

రం—ఆయన్ని మానిపించారా ?

రా—ఆఁ ? మా తరమా ? ఒక్కమాటు మానినట్టే మాని తాంబూలం బిగించి మళ్ళీ అందుకున్నాడు.

తం—మీగోలకి పైనేఉందా ఆయనగాత్రం – ఖంగుమని కంచుగీసినట్టు ?

రం—అబ్బే ! లేదు. ఊరికే అద్దుడు కాగితంమీద సిరాగీత గీసినట్టు ఊరుకుంది.

147

వేర్వేరు ఉద్యోగాల్లో ఉంటూ ఒక పెద్దనగరంలో ఒక భవనంలో జాయింటు కాపురం పెట్టుగున్న కొందరు బ్రహ్మచారి దొరలు, తమ నౌఖరైన ఒక చైనా కుర్రాడి తలకాయ ఎప్పటికప్పుడు సాలిగ్రామంలాగ కనబడు తూండడంవల్ల వాడు దగ్గిరికొచ్చినప్పుడల్లా ఒక క్షౌరపుజల్ల ఇచ్చుగుంటూ ఉండేవారుట. కొంత కాలానికి వాళ్ళకి ఆ కుర్రాడిమీద జాలి వెయ్యగా.

వాళ్ళల్లో ఒకడు—ఒరేయ్! ఈ వేళనించి నీ బుఱ్ఱ టింగు మనిపించడం మా స్తామురా.

వాడు—సరేనండి, చిప్పలుకడిగిన నీళ్ళతో చేసిన కాఫీ మీ కివ్వడం ఈ వేళనించి నేనూ మా స్తాను.

148

నరుసు—ఏమయ్యా, ఆదెయ్యా! సూర్యం, చంద్రం, కాంతం, ముగ్గురూకుడా ప్రభాదేవిని వరిస్తున్నారు గదా, వీళ్ళల్లో అదృష్టవంతు డెవడవుతాడో!

ఆ—అదృష్టవంతుడు కనపడడు గనక ఎవడవుతాడో చెప్ప లేను కాని. ఆవిడ సూర్యాన్ని పెళ్ళి చేసుగుంటుం దని తెలుస్తుంది.

149

ఒకచోట జరుగుతూన్నది కొత్తవాళ్ళ పాటకచేరీ యేమో అనుకుని లోపలికి వెళ్ళి, ఇంతాచేసి ఆ పాడుతూన్నది తనకి పూర్వపరిచిత అయిన చంద్రకళయే అని గ్రహించి, తీరావెళ్ళి కూర్చోకపోతే ఇదిగా ఉంటుందని తను చతికిలబడ పోతూన్నా. లోగడ తనకి నమస్కారం పెడుతోచ్చినా ఆ సమయంలో చంద్రకళ ఊరుకున్నందుకు కొంచెం చికాకుపడి, అప్పట్లో చంద్రకళ పాడుతూన్నపదం సమాప్తి కానిచ్చి, ఒక హరిదాసు.

హ—ఏదీ, చంద్రకళా! భైరవి పెద్దవర్ణంఅను.

చం—ప్రస్తుతం పాఠం లేదండి.

హ—అయ్యో ఖర్మమా! అంత పసందుగా పదంపట్టిన దానవు, చంద్రకళా! పెద్దవర్ణాన్నే నేర్చేళావే!

చం—(నమస్కరిస్తూ) చిత్తం. నమస్కారం. క్షమించాలి, దాసురాల్ని,

హ—క్షమించాలి, దాసుణ్ణి.

150

వెంకటగిరి—మాణిక్యం! తెలిసిందిలే. స్నేహితుణ్ణి అని చెప్పుగుంటూ రావుజీఇంట్లో వ్యవహరిస్తూ వాళ్ళమ్మాయితో ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపు తున్నావు టే!

మా—హరహరా! ఇదిట్రా, నన్నెరుగుండీపడా! ఆ అమ్మాయి ఒకటీ మనచెల్లాయి ఒకటీనా! ఎంతమాటాడావు!

అన్న కొన్నాళ్ళకి ప్రేమజాబొకటి ఇతరుల చేతుల్లో పడడమూ మాణిక్యాన్ని కట్లపాముని కొట్టినట్టు కొట్టడమూ జరిగి, మళ్ళీ అతడు వెంకటగిరిని కలియడం తటస్థించగా,

వెం—ఏంరా? నాతో అంత అబద్ధం ఎందుకురా? చెల్లాయని చెబుతోచ్చావే!

మా—చెల్లాయంటే ఏమిటి నీఊహ? ఆ అమ్మాయి పేరు చెల్లాయి, తెలుసునా?

వెం—చెల్లమ్మ కాదుట్రా?

మా—ఇంట్లో అంతా చెల్లాయి అంటార్రా, కావలిస్తే రాసిస్తాను.

వెం—ఇంకా ఎందుకులే! నీ రాత ఎల్లాఉందో తెలిసింది.

151

కుస్తీలోనెగ్గి బహుమతీ పట్టిగెళ్ళడానికి, ఒక గొప్పవస్తాదు ఒక మహారాజావారి దర్శనానికోసం దిగగానే, వాడిర్ఘూపవర్ణన విని నేసరికి, ఆస్థానాన్ని కొరుక్కుతిని పందిక్కొక్కుల్లా బలిసిన

ఆస్థాన వస్తాదుల్లో కొందరు నడవలేకపోయీ కొందరు నడవ గలిగినవాళ్ళు నడిచివెళ్ళి మంచం ఎక్కగా, మహారాజావారి ప్రతిష్ఠ నిలబెట్టడానికి సమయస్ఫూర్తిగల ఒక తెనాలిరామలింగం వంటివాడు లంగోటీ బిగించి తయారైన మీదట, పట్టణ మహా జనులందరూ చూస్తూండగా, పర్వతం అంత ఉన్నకొత్తవాడూ వాడిపక్కని వాడిచేతికర్రలాగ కనిపిస్తూండే మనవాడూ ఒంటి నిండా చిందూరం పూసుగుని గోదాలో దిగగానె.

కొత్తవాడు—(కుడితొడమీద కొట్టుగుని ఠపేలుమని పించాడు.)

మనవాడు—(సరిగ్గా అల్లానే చేశాడు.)

కొ—(దండకొట్టి ఠపేలుమని పించాడు.)

మ—(సరిగ్గా అల్లానే చేశాడు.)

కొత్తవాడు చేసినదానికి అర్థం మనవాడు గ్రహించుగున్నా డని జనం అనుకున్నారు.

మ—(కొత్తవాడికేసి చూపుడువేలు చూపించాడు.)

కొ—(ఇదేముటో తెలియక తెల్లపోయి ఒకఅంగ వెనక్కి వేశాడు. జనంలో కలకలం బయల్దేరింది)

మ—(తనకేసి చూపుడువేలు చూపించుగున్నాడు.)

కొ—(మరో అంగ వెనక్కివేశాడు.)

జనం కొంచెం కేకలూ లేవిడీలూ మొదలెట్టారు.

మ—(కొట్టడం సూచిస్తూ తనచేత్తో గాలిని పైనించి కిందికి నరికాడు.)

కొ—(రెండు మూడంగలు వెనక్కి వేశాడు.)

జనం, ఓరిబుట్టబొమ్మా ఓరిడబ్బా అని కేకలేస్తూ చప్పట్లు కొట్టేశారు.

మ—(అడుగున్నర ఎత్తు సూచిస్తూ తన రొండు అరచేతులూ పట్టి నుంచున్నాడు.)

కొ—(భయంతో వణికిపోయాడు.)

జనం ఈలయూ కేకలూ అరుపులూ చరుపులూ బాదులూ మొదలైనవాట్లతో మహాకోలాహలం చేశారు.

మ—ఏమిటి ?—(అన్నట్టు గుప్పెడిపట్టి ఊపుతాడు.)

కొ—(పుంజాలు తెంపుగుని పారిపోయాడు.)

జనం మనవాణ్ణి చేతులమీద ఎత్తేసి, నెత్తిమీద కూచోపెట్టుగుని భుజాలమీద ఉరేగించగా,

మహారాజు—ఏమయ్యా ! వాణ్ణి ఎల్లాగెలిచావు ?

మ—ఎమో మహాప్రభూ!! నాకు తెలియదు.

మహా—కుస్తీలో నీకు తెలిసిన ప్రథమవిషయాలే తనకి తెలియవని వాడు పారిపోయి ఉంటాడు. మీరు మీ రహస్యం కాస్త విప్పిచెప్పండి.

మ—(వాడికేసి చూపించి) నువ్వు, (నాకేసి చూపించుగుని)-నన్ను, (కొట్టడం) చంపేసేస్తావనుకో, (అరిచేతులు సూచిస్తూ) మరి మా అబ్బాయిఉన్నాడు, (గుప్పెడి) వాడి మాట ఏమిటి ? అన్నాను. గ్రహించుగోలేక వాడు తోకముడిచాడు.

152

ఏదో సుస్తీగాఉండి బాధపడిపోతూన్న మనోహరమ్మగారు వైద్యుడైన ఒక రావుగారికి కబురుపెట్టగా, ఆయన మనోహరమ్మ ఇంటికివచ్చి, ఆవిడమంచంమీద పరుండడం గమనించి,

వై—పెద్దలు లేరండీ !

మ—(మూలుగుతూ, గట్టిగా) నాన్నా, నాన్నా !

అని కేకేసేసరికి, దగ్గుతో వంగిపోయిన చెమిటి తండ్రివచ్చి పక్కనికూచోగా, వైద్యుడుకూడా కూచుని,

వై—(ఆవిడతో) మీరు లేవకండి. ఏదీచెయ్యి !

మ—ఇదుగో, మీరు తిన్నగా గ్రహించాలి.

అని, తనకుడిచెయ్యి ఇయ్యగా,

వై—మీరు నర్మదాపురుకుత్సీయం చదివినట్టున్నారే! ఎడమ చెయ్యి ఇయ్యండి.

అనగా, ఆవిడ ఎడమచెయ్యి ఇచ్చినమీదట పరీక్షించి,

వై—ఈవిడకి పెళ్ళే మందండి.

మ—తమరే కటాక్షించాలి, ఆ మందు.

వై—(వెళ్ళడానికి లేవబోతాడు.)

తండ్రి—(చెముడువల్ల పైసంభాషణ వినపడక) ప్రస్తుతం మూడుమోతాదు లిప్పించండి. కావలిస్తే తరవాత పిరాయించుగో వచ్చు.

153

రాజు—బండీ, స్టేషను కెంతక్కడతావు ?

బండివాడు—బలువు మీరేనా ?

రా—నువ్వూ, బండీ, గంటా—ఇవన్నీ మాత్రం బలువులు కావూ ఎద్దుకీ ?

బం—అదికాదుబాబూ! మీరొక్కరేనా బండిలో కూర్చునేది ?

రా—అవును. ఎంతక్కడతావు ?

బం—నిమిట్లో కడతాను. రైలందుకుంటాను.

రా—అదికాదురా, ఎంతసొమ్మిస్తే కడతావు ?

బం—అదాండీ. మీరెరగరూ ? మామూలే !

రా—మామూలా ? నాకు దిగిదులుపుగుని చక్కాపోడం మామూలు !

బం—అల్లాటోళ్ళకి కట్టకపోడం నాకు మామూలు.

రా—దిగేటప్పుడుగాని అల్లాంటివాళ్ళు నీకు తెలియరుగా !

బం—ఎక్కకుండానే తెలుస్తూంటేనే బాబూ !

రా—నాకు బండీయే అక్కర్లేదూ. హాయిగా నడిచేపోతాను.

బం—చిత్తం. శీఘ్రంగా నడవండి. నాయెద్దుకి కాలు నలిగింది. నేను కట్టనే కట్టను.

154

ఒక పెద్దపన్నా పోలీసుఇనసపెక్టరు ఇంటిదగ్గిర మామూలుగా ఉండేటప్పుడు తొడుక్కునేటందుకు సాదాజోడు కొనుక్కోవాలని షాపుకివెళ్ళగా, జోళ్ళషాపువాడు గుండెల్లో రాయిపడి ఏదో నొల్లుకుని పోతాడ్రా అని భయపడుతూ,

షా—నమస్కారం బాబూ, దయచెయ్యండి.

ఇ—నాకోజోడు కావాలోయ్ !

షా—చిత్తం. తమరు సర్వాధికారులు. మాప్రాణాలు తమ చేతులోనే, ఉండేది.

అంటూ ఎన్నివేలవేరు కొలతల జోళ్ళు తీసిచూపించినా వాటిల్లో ఎవీ ఇనస్పెక్టరుకాలికి ఎక్కకపోగా,

ఇ—(ఇంకా ప్రసంగం సాగిస్తూ) చెప్పిచెప్పి మా సర్వాధికారమే చెప్పుగోవాలి, పోదూ! అసలు మాకు ఓ కాలు ఎప్పుడూ జైలులోనే ఉంటుంది.

షా—పోనీ, ఆమిగత కాలేఆయిరి, ఛస్తే ఏజోడులోనూ ఇమిడేటట్టు కనపట్టంలేదు. బాబూ!

155

సెకండుఫారం చదువుతూన్న కొడుకు తండ్రితో,

కొ—నాన్నా! ఈయేడు లెఖ్ఖల్లో ప్యాసవుతాను, నాన్నా.

తం—ఏం? నిరుటికంటె ఈయేడేం కొమ్ము లొచ్చాయా? నీ లెక్కలు ఇహానంతే.

కొ—కాదు నాన్నా. ఈయేడు నాకు లెఖ్ఖలకి 'దేవసహాయం' ఉంది.

తం—పురుషప్రయత్నం లేందే అదిఉండదోయ్, ఛవటా! ముందు నోరుమూసుకొని చెయ్యి. తరవాత దేవ సహాయం.

158

మొయ్యలేనంత డబ్బు తమరికిఉన్నా, ఇంకా తేరగావస్తే బావుకోవాలనే ఊహతో ఎల్లానైనా వొడుపుమాటలు చెప్పి ముగుణ్ణి సంభావనకి గెంటదల్చుగుని,

కంతాలమ్మ—చూడండీ! రేపు నాగారంలో పాకెన్నష. రోజల్లా గోళ్ళుగిల్లుకుంటూ కూచోడమే కాని మీరుచేసేదే ముందీ? వెళ్లి సంధెవేళకి ఇట్టేరావచ్చు.

ముగుడు—(ఎల్లానైనా నడక తప్పించుగోవాలని మూలుగుతూ) నాకు ఈనడుంనెప్పి ఓటికాదూ?

కం—దానికేం ? అదెప్పుడూ ఉన్నదే అయె, నేను తెల్లార కుండా, మీకు మినపరొట్టె చేసిపెడతానుగా :

అని, అతణ్ణిఒప్పించి, ఝూం తెల్లారకట్టే, కాళ్ళు పిరగ దొక్కుని, ఆ హడావిడిలో కాస్త బెల్లంతరిగి తేవడానికి వెళ్లి కత్తిపీటమీదపడి, ఎల్లానోఇద్దై, చెయ్యగా, బూలిమూకుడు రొట్టీ ఊదిపారేసి నిమ్మళంగా నీలుగుతూ బయల్దేరి వెళ్లి అయిదునిమిషాల్లో తిరిగివచ్చి,

ముగుడుఏమేవ్ !

కం—ఏం ? అప్పుడే ఏ మొచ్చిందీ, వెనక్కిరావడాని కీ?

ము—(మూలుగుతూ) సంభావన రేపుటే !

కం—ఇంతేకదా !

అని, మర్నాడు అల్లానే చేసిపెట్టి పంపగా అతడు మొదటి నాటికిమల్లేనే తక్షణం తిరిగివచ్చి, అతినీరసంగా.

ము—ఏమేవ్, సంభావన నిన్ననేటే !

కం—మీనిన్న కాల్చిరిగదయ్యా ! మూకుళ్ళకి మూకుళ్ళు తినడం అయిందికదా. ఆమాట గట్టిగా ఏడవక మూలగడమూ మీ మూలుగు ఊరికెళ్ళా !

ము—(మూలుగుతూ) వెళ్ళి వచ్చేసిందీ ?

157

రాఘవులు—కేశవులూ ! ఎంతమట్టుకొచ్చింది, మీ యింటో పెళ్లివ్యవహారం ?

కే—చెరిసహం కుదిరింది.

రా—అంటే ?

కే—అంటేనా ! వాళ్ళు పిల్లని ఇస్తాం అనడం తడువుగా చేసుగోడానికి మేం ఒప్పుగునేటందుకు అంతా సిద్ధం చేసుగుని ఉన్నాం. సరి, నీ రాజీసంగతి ఏకాడికొచ్చింది ?

రా—అదీ సహాంసహాం అయింది.

కే—అంటే ?

రా—నే చెప్పిందంతా వాళ్ళువినడం అయింది.

కే—అయితే, చెరిసహాం నీదీ అయినట్టేగా !

రా—కాలేదేమో అని నాభయం. ఏమంటావా, వాళ్ళు విన్నది వాళ్ళకి తెలియాలి, తెలిసిన మీదట నచ్చాలి, నచ్చిన మీదట వాళ్ళు ఒప్పుగోవాలి.

158

క్షైవారపు శిఖరయ్యగారి క్షౌరకాండయొక్క మధ్యరంగంలో ఆయన మెడమీద కొంచెం కత్తితో ఒత్తవలిసొచ్చి, మంగలి, అమాంతంగా ఆయన బుర్రకాయ కిందికి వంచబోగా,

శి—(ఊపిరి సలపక) అబ్బ ! అబ్బ ! ఉండరా !

మం—మరి, వెనకాల కొంచెం ఒత్తాలండి.

శి—అయితే, పొట్టవేపునించి తిరిగి వీపువైపు, రా.

మ—రావచ్చుగాని, నేనవతల తొందరగా వాయింపు కెళ్ళాల్లండీ !

159

కృష్ణుడు—ఒరేయి పానకం ! నీకూ అమృతానికీ చెడీపేడీ అయిందిటా ?

ఫా—అవదూ ?

కృ—ఏమిటీ కథా ?

పా—అఁ ఏముందీ ? ఏవోకొన్ని దంపుడుపద్యాలు కట్టి తెచ్చాడు. తెచ్చి, బాగున్నాయా లేవా అని నన్ను చంపడం మొదలెట్టాడు. మొదలెడితే, పోరా నీకు కవిత్వం ఏమిటీ అన్నట్టు ఓ వందదోషాలు అయిదునిమిషాల్లో చూపించాను.

కృ—అయితే మరి దోషాల్లోంచి రోషాల్లో పడలేదూ మీ రిద్దరూనూ ?

పా—వాడికి రోషంతేందేత్రా ! వాడు ససవ ! కాడంటావా ?

కృ—అవును.

పా—ఎల్లాకనిపెట్టావ్ ?

కృ—లేకపోతే నిన్నడగడం ఏమిటి పద్యా లెల్లాఉన్నాయనీ! మరోచవటని ఎవణ్ణడిగినా, తీరిపోను !

160

తొందరగానూ ఖంగారుగానూ ఇంట్లోకి బొరపడుతూ,

ఆయన—అమ్మకుంకా ! చూడూ !

ఆవిడ—ఏమిచేమిటి ?

ఆయన—పెసరయ్యగాడు !

ఆవిడ—ఏమన్నాడు ?

ఆయన—తనతో నేను సమానం కాదుట.

ఆవిడ—మీ అంతవారు వాడితోనూ సమానం కాకపోవాలా యేమిటి ఊరుకుందురూ, వాడిలెఖ్ఖేమిటి, వాడిమాటలు లెఖ్ఖేమిటి పోనిస్తురూ ! అసలు వాడు ముండల ముఠాకోరూ !

161

తమతమ వైళ్ళ వేగాల్లగుర్రించి ముగ్గురు అభూతకల్పనలు చేసి మాట్లాడుకుంటూ,

ఒకడు—మారైలు చాలావేగంగా పోతుంది. అది వెడుతూంటే భూమేదో జలమేదో ఆకాశం ఏదో తెలియకుండా సర్వమూ ఒక్కటే గిలాబాలాగ ఉంటుంది.

రెండోవాడు—అది యింకానయం. మారైలు వెడుతూంటే, పక్కనున్న టెలిగ్రాపు స్తంభాలు బహుదగ్గిరిగా వచ్చినట్లైపోయి సన్నకోతకోసిన దువ్వెన్న పళ్ళలాగ కనబడతాయి.

మూడోవాడు—ఒస్. ఇంతేనా! మా రైలుసంగతి వినండి. మొన్న నేను రాజమండ్రీలో రైలెక్కాను. రైలు బయల్దేరింది. ఇంతలో నాచేతులోఉన్న పుస్తకం ప్లాటుఫారం మీదివాడెవడో ఊడలాక్కున్నాడు. వాణ్ని ఒక్క చెంపకాయ లాగపోయాను. ఆ చెంపకాయవెళ్ళి దానిదుంపతెగా, కడియంస్టేషన్లో పోర్టరు దవడమీద పడింది.

162

ఇంగ్లీషు విద్యార్థులు కొందరు, తమ గురువుగారు చెప్పే చెప్పడాన్నిగురించి ప్రైవేటులో మాట్లాడుకుంటూ,

సత్యం—మనవాడు గజ్జికట్టడంతోటే, నాకు నిద్దరొస్తుంది. నాకేమీ తెలియదు.

ముత్యం—నాకు నిద్దరాపట్టక కీచుకీచయిపోతాను. ఆయనకే తెలియదుట, ఆయన చెప్పేది! ఎమో, చాలామంది అల్లా అంటారు.

విశ్వం—అదికాదు. ఆయన చెప్పేటప్పుడు, ఏపుస్తకం చెబుతున్నాడో ఆపుస్తకం రాసినవాడికికూడా తెలియకపోడం అనేది ప్రారంభం అవుతుందిట,

స—నేను నమ్మను. వాడెందుకుంటా డక్కడా ?

వి—అయ్యో ! నువ్వెరగవురా ! మనస్తంతు లుంటాయి.

ము—ఒకవేళ ఆపుస్తకం రాసినవాడు కీర్తిశేషుడైతే, ఎల్లా ?

వి—ఓరి, వెర్రివాడా ! అయినా. ఫరవాలేదురా. ఆత్మ తంతులని ఉన్నాయిరా ! వాట్లకి నాశనంలేదు.

163

శివయ్య—మూర్తిరాజు మొన్న మీటింగుకి వచ్చాడన్నారా, ఎవళ్ళేనూ !

పట్టాభి—రాలేదని నేనన్నానని చెప్పు, వాళ్ళతో.

శి—ఎవళ్ళో జ్ఞాపకంలేదురా (అని కళ్లుమూసుగుని జ్ఞాపకం చేసుగుంటూన్నట్టు నటిస్తాడు)

ప—సరేలే. వాళ్ళెవళ్ళో జ్ఞాపకం వచ్చినప్పుడే చెప్పు వాళ్ళతో.

శి—అంతే చెయ్యాలి.

ప—కాని, ప్రస్తుతం నేనన్నది జ్ఞాపకం ఉంచుకో, తీరా వాళ్ళెవళ్ళో జ్ఞాపకం వచ్చిన తరవాత, వాళ్ళని కలుసుగుని నిలబెట్టి, కళ్ళుమూసుగుని, నేనేమన్నానో జ్ఞాపకం చేసుగోడం మొదలెడితే, వాళ్ళతాడుకుడా తెగుతుంది.

164

కోటయ్య—ఫిల్ముచిత్రానికి ఏంపేరు పెట్టడం నీ కిష్టం ? ఆడపేరా, మగపేరా ?

భార్య—నాయిష్టం మాట ఎల్లాఉన్నా, ఆడపేరు పెట్టడమే లాభం,

కో—లాభమా ?

భా—లాభమూ స్వభావసిద్ధమూ కుడానూ !

కో—ఏం, నువ్వు ఆడదానవనా ?

భా—ఇదా గ్రహించారు?—నెలదాటే యోగ్యత ఉంటే ఉండవచ్చునని !

కో—ఓహో, అప్పుడు తొమ్మిది నెలలూ మొయ్యడం సంభవించ వచ్చుననా ! ఎంత గడుసువీ !

165

తమరి ప్రమదావనంలో ప్రతిధ్వనిచ్చేరాయి ఉందని చెప్పి స్నేహితులందర్నీ ఊరించి చంపి, ఒకనాడు! తద్విషయంలో అయిదింటికి స్నేహితులందర్నీ పిలిచి ఆవనంలోనే వాళ్ళకి కాఫ్యాదులు ఇస్తూ వాళ్ళు అవి ఆరగిస్తూన్న సమయంలో, తను, దానికేసి నడిచి,

మీనయ్య—ప్రతిధ్వనోయ్ !

ప్రతి—ఓయ్ !

అనగా, చివరపలుకు ప్రతిధ్వనించటంవల్ల అందరూ మెచ్చుగున్నా, అక్కడ తను దాక్కోపెట్టిన మనిషివాడు తమ చెప్పిన మాటలు మరిచి పోయాడని మీనయ్య కొంచెం ఆగ్రహించి, మళ్లీఅటువెళ్ళి.

మీ —సరిగ్గా చెప్పు వెధవ పీనుగా !

ప్రతి—వెధవ పీనుగా !

మీ—(కోపంతో). ఛంపేస్తా !

ప్ర—ఛంపేస్తా !

అని ప్రతిధ్వనులురాగా, బయల్దేరుతూన్న కోపంచంపుగుని, పైకి నవ్వుతూ, స్నేహితులతో,

మీ—చూశారా! ప్రతీ అక్షరం ఎంతస్పష్టంగా వినపడుతోందో!

ఒక స్నేహితుడు—(ఆ రాతికేసి నడిచివెళ్ళి) నువ్వుంటా ఎప్పణ్ణించీ?

ప్రతి—ఒంటిగంట నించి

ఒకస్నే—ఇదేమిటి, మీనయ్యా! ఈప్రతిధ్వని ప్రశ్నలకి సమాధానం కుడా చెబుతోందే!

మీ—ఇది కొత్తరకం, ప్రపంచంలో ఏదీ అసంభవం కాదు.

166

బాపిరాజు—మనిషి కోతిలోంచి పుట్టాడంటారేమిటీ? నీ అభిప్రాయం ఏమిట్రా, రామకోటీ?

రా—ఆఁ, ఇల్లా అంటున్నారని కోతులికి బోధపడదుగనక! లేకపోతే అవి పేచీపెట్టవూ?

బా—పోనీ, ఈవాదన మంచిదంటావా?

రా—మంచిదే.

బా—ఏం?

రా—కొందరు కొందరు వెనక్కి వెనక్కి మాట్టాడుకుపోతూ తమ తాతల్నీ ముత్తాతముత్తాతల్నీ స్తోత్రాలు మొదలెట్టి గొడవ చేస్తూంటారు. అలాంటివాళ్ళని ఇవతలికి గెంటడానికి ఈవాదన కాస్త గోడలాగ పనిచేస్తుంది.

167

ఒకచోట అతిఘాటుగా ఉపన్యాసం పేల్చేస్తూన్న ఒకవక్త—మహాజనులారా, నానోట చీమంత అబద్ధం వచ్చినాసరే, నా నెత్తిమీద పెద్దపిడుగు పడుగాక !

అంటూ చాలాహడావిడిగా అభినయించగా. ఏదో ఊరికే బులబులాగ్గా కర్రముక్కలతో అంటెట్టిఉన్న ప్లాటుఫారం పెళ్ళుమని విరిగి ధమ్మమని కిందపడిపోగా,

ఒకసభ్యుడు—పిడుగు పడింది. అన్నీ అబద్ధాలన్నమాట.

అనగా. చాలామంది తెల్లపోగా, కొంతసేపట్లో, ఆ కలపలోంచి వక్తలేచి పైకివస్తూండడం గమనించి,

మరోసభ్యుడు—నెత్తిమీద పడకుండా దూసుకుపోయింది పిడుగు. నెత్తిమీదే పడుతుందన్నాడు. అన్నీ అబద్ధాలే.

168

అవధానిగారు బల్లదగ్గిర కూచుని జోడుకేసి పరిశీలనగా చూస్తూండగా,

కొడుకు—అదేమిటి, నాన్నా !

అ—జోడులో టోపీపడ్డాను, ఉండరా !

కొ—కాలి జోడులోనా ? కాలిదగ్గిరికి టోపీ ఎల్లా వచ్చింది నాన్నా !

అ—అబ్బ : కంటిజోడులోరా. టోపీఅంటే దండగ :

కొ—అమ్మినాయన ఎవరూ ?

అ—నాస్నేహితుడే.

కొ—అయితే, దగా ఎందుకుంటుందీ ?

అ—అందుకనే ఉంటుంది, నేను తన్ని నలుగురిలోనూ యాగీ చెయ్యలేనుగదా, తన రహస్యం అల్లానే ఉంటుందిగదా, అని 12 రూపాయలదానికి 21 పుచ్చుగున్నాడు.

కా—ఖరీదు కాయితంమీద వేసిచ్చాడా ?

అ—ఆ ఇదుగో.

కా—దీనిమీద 12 రూపాయలనే ఉంది.

అ—(జోడూ తీసేసి చూసి) అవున్రోయి. జోడెట్టుగుని 12 కేసి చూస్తే 21 లాగ కనిపించే జోడిచ్చాడు, మాట్టాడకుండా, దాంతోచూసి నేనిచ్చేశాను.

169

దీక్షితులు—ఎమోయ్, రాంభొట్లూ ! ఏమిటామూట?

రాం—మినుములు.

దీ—ఎల్లా ?

రాం—ఎరగవు గావును, పంతులుగా రింట్లో దశదానాలు.

దీ—ఎవరూ, పాపం !

రాం—మగపిల్లాడే. ఈపాటికి పీటలమీంచి లేస్తారు.

170

సూరయ్య—విన్నావా, నారయ్యా ! మన ప్రజాపతి చదువుకున్నవాడనికూడా తేలింది. వాడికి మొదట లక్ష్మీప్రసన్నం. ఇప్పుడు సరస్వతీ ప్రసన్నం.

నా—ఆగాడు. (అని ఆలోచిస్తూ) మొదట వాడికి లక్ష్మివచ్చి కనపడింది. ఒప్పుగున్నాను. తరవాత, సరస్వతివచ్చి కనపడిందా. ఓ, అదీ వాగానేఉంది,

సూ—ఏమిట్రా ఆ ఆలోచనా, ఆ సందేహమూనూ?

నా—ఏమిటంటావా? లక్ష్మికి చేతులో ఉంటుంది తామర. సరస్వతి మొగుడు తామరలోంచి పుట్టాడు. మన ప్రజాపతిలోంచే తామర పుట్టింది. వీణ్ణి మెచ్చుగోడానికివచ్చి వాళ్ళిద్దరూ ఎప్పుడో ఒకప్పుడు కనపడడం సహజంగానేఉంది.

171

పదిహేనురోజులక్రితం తనదగ్గిర మందు పట్టిగెళ్ళి మళ్ళీ ఐపూ మచ్చా లేకుండాపోయిన పున్నయ్య తనకొట్టు దాటి రోడ్డు మీద నక్కినక్కిపోతూండగా కనిపెట్టి ఎల్లానేనా వాడిదగ్గిర కొంతలాగలేకపోయామే అనేబాధ దాచుగుని పైకినవ్వుతూ,

వైద్యుడు—ఏమండోయ్, పున్నయ్యగారూ! రండి, కన పడ్డం మానేశారే!

పు—ఏమిటోనండీ! అనుకుంటూనే ఉంటాను. ఎప్పటి కప్పుడు ఏదోవోటి వస్తూంటుంది.

వై—పోనిలేండి. ఒంట్లో ఎల్లాఉంది?

పు—బాగావుంది.

వై—ఉందికద! అల్లాయితే మందు ఇంకా పట్టిగెళ్ళండి. "కంపౌండర్! చూడూ! వీరికి........"

పు—వద్దండి, వద్దండి, అదీ ఎదీకూడా నేను పుచ్చు గోలేదు.

వై—పోనీ, ఇప్పణ్ణుంచి పుచ్చుగోండీ! దానికేం?

172

మండలం—పరమయ్య ఈమధ్య మేడకట్టాడుట, విన్నా వురా పెంటయ్యా?

పెం—విన్నాను.

మం—ఎందుకురా, వాడు మేడకట్టడం?

పెం—బహుశా, ఎక్కపడడానికి.
మం—అమాత్రానికి చెట్టెక్కకూడదూ పోనీ!
పెం—చెట్టెక్కడం చేతకాదేమో!
మం—నిచ్చెనేసుగోవాలి అలాంటప్పుడు.
పెం—వాడి నిచ్చెనకాళ్ళకి రెండింటికీ బాఘా ఓ మూరెడు హెచ్చుతగ్గు ఉంది. వాడికంటె ముందు అదే పడిపోతుంది.
మం—నన్నడిగితే నేనైనా ఇస్తును భేషైన నిచ్చెన.
పెం—నిన్నడగడానికి నీకంటె వాజమ్మగా తయార్వాలి. అవడం కష్టసాధ్యం.
మం—మొండివాదన వాదిస్తే ఏమి ఒలుకుతుందీ?
పెం—గుండెలేకుండా వాదిస్తే ఒలికేబాపతే!

173

మనిషి నెత్తురు చప్పరించిచూసిన ఓ చిరతపులి రాత్రెళ్ళప్పుడు ఒక ఊరువీధుల్లో తోక ఘూడించుగుంటూ తిరగడం మామూలు చేసుగునేసరికి, బతుకుతెరువు తెలిసిన మహాజనులందరూ సాయింత్రం పడకుండానే దీపా లార్పుగుని తలుపులు బిడాయించుగుని జాగ్రత్తపడుతూండగా, అది ఓనాడు ఆఊరి పోలీసుస్టేషన్ ఎదర బైటాయించేటప్పటికి, అక్కడ కాపలా కాస్తున్న నెం. 102 పోలీసు భంట్రోతు, సాహసించి అమాంతంగా పక్కగదిలోకిఉరికి తలుపువేసుకోగా. ఖైదీలు గొంతెత్తి పాడ్డం మొదలుపెట్టడం తనకిష్టంలేక.
పో—ఏయ్! పాడకండి. అది నేనున్న గదిలోకి పైనించి ఉరకగల్దు.
అని కేకవేసినా వాళ్ళుమానక, ఆగోలలోనే ఆకురాయితో ఇనపకమ్మిలు తెగ్గోసి అయిదుగురు ఉడాయించేసిన పిదప ఆరోవాడు (స్థూలకాయు డవడంవల్ల) ఆ కమ్మిల్లో చిక్కడి ఉండగా,

చిరతపులి వెళ్ళిపోడం పసిగట్టి మరేదో జరుగుతోందని పైకొచ్చి, చూసి, వాణ్ణికొడుతూ,

పో—వాళ్ళేరీ, చెప్పు, బద్మాష్ !

వాడు—(పోలీసుని వినిపించుగోక, తనలో) నయమే, మొదట్లోనే నేను యత్నించలేదు, వెళ్ళడానికి.

174

తండ్రి—ఏమండీ, మేష్టారూ ! మా వెంకటపతి ఎల్లా ఉన్నాడు, ఈయేడు ? నిరుడు ఒక్కమార్కు తక్కువొచ్చిందంటూ ఇందులోనే కూచోపెట్టారు, అసూ్కలువాళ్ళు, వాళ్ళ మొహంఈడ్చా !

మే—మా మొహమూ ఈడిపించేట్టున్నాడు, ఈయేడు· నిరుడే నయం.

తం—ఏమీ సరిగా లేడంటారా ?

మే—ఎల్లా ఉంటాడూ? మరోహక్కు ఎక్కువైంది ఇప్పుడు.

తం—ఎక్కువవడం మంచిదే కాదుటయ్యా ?

మే—అయితే నన్నెందుకూ మీరడగడం ?

తం—అదికాదండీ ! రొండోయేడు దుఃఖంతో చదవాలిగా !

మే—అంతా దుఃఖిస్తారాండీ ! ఒక్కొక్క రొండోపెళ్ళివాడు దుఃఖిస్తూనే బాణాసంచాకుడా కాలిపిస్తాడు.

తం—ఎల్లా అయినాసరే పైకి వెళ్ళేట్టు చూద్దురూ !

మే—మీరతడు పడిపోకుండా చూసుగుందురూ ?

175

ఒకావిడ భరతనాట్యం మొదలెట్టి, ఒకపదం పడుతూ, అందులోవచ్చిన 'నెరజాణ' అనే ముక్కలోది 'జాన' అనుకుని, చేత్తో జేన అభినయించగా,

ఒకసభ్యుడు—ఆహాహా! ఏమికళ, ఏమికళ!

పక్కవాడు—(నవ్వుతూ) ఏం, ఏం?

ఒ—ఆవిడ, కేవలమున్నా, ఆయొక్క శబ్దబ్రహ్మం!

ప—చాల్లే ఊరుకో. అర్థబ్రహ్మం.

ఒ—ఎల్లా?

ప—ఎల్లానంటావా? ఎవరు సొమ్ము చేసుగుంటారో, వాళ్ళు అర్థం చేసుగున్నవాళ్ళు కాకుండా ఎల్లాపోతారూ?

176

రంగం—సోములూ! "ఊటీ" వెళ్ళి వచ్చావుట.

సో—అవును.

రం—నీకు చాద స్తంగాని, చలవ ఇక్కడమాత్రం లేదూ? అయితే, యేటా వెడుతున్నావా?

సో—రొండోమాటు ఇది.

రం—అయ్యో. సొమ్ము తగులడిపోతుంది. ఇహ చాల్లే. వెళ్ళకు.

సో—మొదటిసారి వెళ్ళొచ్చి అల్లానే అనుకున్నాను. అనుకుంటూండగానే, మళ్ళీ కరిచింది పిచ్చికుక్క, మరి కర వకపోతే, మరి వెళ్ళను.

177

తనబంధువు ఆసుపత్రిలో ఆపరేషను చెయించుగోడంగురించి కబురంపగా, ఒకాయన ఆసుపత్రికివెళ్ళి దిక్కుమాలిన అనవస రపు గొడవలతో ఆ బంధువుని సకలబాధా పెట్టగా, వీణ్ణి ఎరక్క పోయి రమ్మంటినిగదా అని అతడు లోలోపల కుసిళ్ళుతూండగా,

ఆయన—పాపం! నువ్వు ఒంటరిగా ఉంటూండడంవల్ల తోష్తూండదు గావును!

బంధువు—తోచకేం? నన్ను చూడడానికి నీ బోటిగాడు నాకు ప్రతీరోజూ ఎక్కడ లభిస్తాడు?

178

ముత్తయ్య తను తలంటుగోడానికి ఒక వడ్డీమంగలికి కబురంపగా, వాడువచ్చి, ఆయన్ని పరకాయించి, తన రుమాలు తీసి తలకి వాసిన చుట్టినట్టు చుట్టుకోగా.

ము—ఏంరా?

వడ్డీ—అయ్య!

ము—నువ్వు వడ్డీ మంగలివేనా?

వ—చిత్తం.

ము—(హేళనగా) అయితేమరి తలకాయకి రుమాలు అల్లా చుట్టుగున్నా వెందుకూ, బూజు దులిపేవాడులాగ?

వ—చిత్తం.

ము—చిత్తం ఏమిటీ?

వ—కోపం చెయ్యకండి. తమరిపొట్ట మడతల్లోనూ తొనల్లోనూ బూజూ ఉండచ్చునండి.

179

పల్లెటూరి అల్లుడు పట్నవాసపు అత్తారింటికి వెళ్ళిన నాడే నాజూకుతనం ప్రకటించాలని నున్నటి క్షౌరం చెయించుగుని స్నానం నిమిత్తం దొడ్డోకి వెడుతూండగా, కిందుగా ఉన్న ఆ దొడ్డిగుమ్మంపై కమ్మి మనిషి గిల్లార్చుకుపోయి ప్రాణం కళ్ళంటేటట్టు ఫెడీమని తగలగా,

అ—(తలపట్టుగుని, కూచోపడి) అబ్బ!

అనగా, చదువునేర్చిన అతడిపెళ్ళాం అక్కడికి పరిగెట్టి.

పె—ఎదీ, చూడనీండి, చెయ్యితియ్యండి నెత్తిమీంచీ: అన్న మీదట, అతడు చెయ్యితియ్యగా,

పె—నెత్తురులేందే !

అ—లేకపోతే ?

పె—ఇది అలంకారాలలో ఒకటి !

అ—ఛస్తూంటే అలంకారమా ?

పె—అవునండీ, విశేషోక్తి.

అ—ఛీఛీ, అవతలకి పో.

పె—నిజమేనండి, చూడండి కావలిస్తే. విశేషోక్తి అంటే కారణం ఉంటుంది, కార్యం ఉండదు.

180

సౌభాగ్యం—ఎమోయ్ ! వెంకట్రావ్ ! ఏమిటి విశేషాలు?

వెం—ఎక్కడ ?

సౌ—ఎక్కడేమిటి, ప్రతీచోటానూ !

వెం—ప్రతీచోటానా ? ఏముందీ ? ఉన్నవాళ్ళు తింటున్నారు. లేనివాళ్ళు పడుకుంటున్నారు.

సౌ—అబ్బ ఆమాట సరేనోయ్ ! కొందరుఉండీ లేనివాళ్ళున్నారు, వాళ్ళ మాటేమిటని !

వెం—ఓస్. అదీ అడగాలా ? ఉండీలేనివాళ్ళు తినీతినకుండా ఉంటున్నారన్న మాటేగా !

181

రాత్రి తొమ్మిదిగంటలకి వచ్చే 'మేలు' బండిఎక్కే ఉద్దేశంతో, ఎనిమిది గంటలప్పుడు, ఒక రైలుస్టేషనుకి దగ్గిరిగా ఉన్న ఒక అన్నవిక్రయాలయంలో బుచ్చన్న ఎంగిలి పడుతూండగా, అతని స్నేహితుడు రామోజీ లోపలికివెళ్ళి, బుచ్చన్నని చూసి,

రా—ఎవరదీ ? బుచ్చన్నలాఉందే !

బు—మరే.

రా—మేలుకొ ?

బు—మొదట్లో అల్లానే అనుకున్నాను.

రా—ఇప్పుడు ?

బు—ఇప్పుడా ! తెల్లారకట్ట రైలే రాసింది.

రా—ఏం ?

బు—ఈ కూరముక్కలు ఆలోపుగా నములుడు పడేటట్టు తోచదు.

182

పండిట్—తుమున్నర్ధకం ఎప్పుడు ప్రయోగించడం ? రామన్న !

శా—రొంపగా ఉన్నప్పుడండి. నాకిప్పుడు రాదు.

పం—హారి ! చేదాద్యర్ధకం ఎప్పుడూ ? భీమన్న !

భీ—నుయ్యి ఉన్నప్పుడండి.

పం—ఓరి మీ వ్యాకరణాలు అంటించిరి గదర్రా, మీ వ్యాకరణాలు అంటించా !

ర—పడిశం పట్టినప్పుడు అంటించడానికి వీలుగా ఉండేది తుమున్నర్థకమేనండి. వాడిది వీలుకాదు. నేను రైటేనండి,

183

ఒక హరిదాసు అద్దంఎదట కూచుని తన స్నేహితులతో మాటా పలుకూంఆడుతూ తలదువ్వుకుంటూ ఉండగా ఆయన కంటె ముసిలివాడై పింఛన్ సర్వీసు పాతిగేళ్ళు దాటిపోయిన ఒక గొప్పవాడు తలపాగాతోసహా, వచ్చి,

గొ—ఏమండోయ్ ! హరిదాసుగారు ! అద్దంఎదట కూచుని మెరుగు పెడుతున్నట్టున్నారు.

హ—(గొప్పవాడి మీసాలకేసి దీక్షగాచూస్తూ) మరే, మరే. రంగేసుగోవడం ఇప్పుడప్పుడే అయింది.

184

పెద్దజీతం, వల్లమాలిన పెక్కా, చచ్చినంత నిరసనభావం. అఖండమైన పిరికితనం, మాటతిరగెయ్యడంలో నేర్పాగల ఒక నగర వి. దా, ర. (విమానదాడి రక్షణ) శాఖాధికారి జీతం బత్తెంలేని తనకింది పరివారాన్ని రక్షణ కృత్యాల్లో తరిఫీయతు చెయ్యవలిసొచ్చి, వాళ్ళు దెబ్బతగిలినవాడికి ప్రథమచికిత్స ఎల్లాచేస్తారో చూడడం నిమిత్తం తనకే దెబ్బతగిలినట్టు తను నటిస్తానని వాళ్ళతోచెప్పి, క్రిందికి పడిపోతూ,

అధి—అయ్యో; బాధబాధ! బతకను, బతకను, రక్షించండి అయ్యో!

అనగా, వాళ్ళు. నవ్వుమొఖాలతో గబగబా ఆయన్ని వాహనం ఎక్కించి చికిత్స అభినయించగా, ఆయన లేచి,

అధి—భేష్. మాబాగాచేశారు. కాని, మీ మొఖాలు అంత కలకలలాడుతూ పెట్టడం బాగుండలేదు.

వాళ్ళు—మాకు విచారం ఎల్లా వస్తుంధండీ?

అధి—చిక్కు సమయంగనక రావద్దూ?

వాళ్ళు—సమయం చిక్కుదైనా విషయం మీదైనప్పుడు మిమ్మల్ని ఎంత చివరదాకా మోసినా మాకు సంతోషమేనండి.

185

దాదా—హేమండీ, సోమన్నగారూ! మనహేమన్నా వొచ్చాడు సూశారా. నెల్లెంలాగా సిక్కి!

సో—చిక్కడేం ఖర్మం?

దా—కానితిర్గుడూ అండీ!

సో—అంత పాడయాడా? విన్లేనే?

ఉద్దేశం సాలా మంచిదీ అండీ. తిర్గడంమాట నే అనేది.

సో—ఎక్కడ ? అంమకోసం చిక్కడం ఎందుకు ?

దా—ఎందుక్కా అంటా రేమండీ ? కొవ్వూర్ తాలూకా తాలూకా సీదాగా అహోరాత్రం కాంగ్రెస్ ప్రచారంచేస్తే హేఫ్టీ అయితుందండీ, సిక్షంకాకా ! యెట్రీలాగా సెప్తారే !

186

నాగేంద్రుడు—ఏంరా, పుల్లయ్యా ! మీ అమ్మ మీద కేక లేసి విసుక్కుంటున్నావేం ?

పు—లేకపోతే, ఏమిట్రామరీ ! చంపుగు తింటూంటేనూ.

నా—ఏంజేసింది ?

పు—ఏంజేసిందా ! బేడకానెక్కడో పారేసి, అది కనపడితే, పెద్దతిరపతి వెడతానని మొక్కుగుంది.

నా—అయితే నువ్వేమన్నావు ?

పు—పోనీ, అన్నదానవు ఎల్లానూ అన్నావు. ఏ చిన్న తిరపతో వెళ్ళవమ్మా అన్నాను.

నా—అంటే. ఏమందీ ?

పు—మరీ గందరగోళం చేసింది. మనస్సులో సంకల్పం ఎవళ్ళకి కలిగితేంగనక, తిరిగిపోనియ్యడం పాపంగదా అంటూ రొండుచోట్లకీ మొక్కుగుంది.

187

ఒక వి. దా. ర. భటుడు ఒకగృహం ఇవతలికి దీపం వెలుగు పడుతోందని గృహస్థుని బెదిరించి షొమ్ములాగడం అలవాటు చేసుగుని, నాలుగోసారీ మళ్ళీవెళ్ళి కేకవెయ్యగా ఇంట్లోంచి ఎవ్వరూ పలక్కపోగా, వెళ్ళిపోతూ, ఆవరణస్థలం చివర యజమాని చుట్టకాల్చుగుంటూ కూచోడం చూసి,

భటుడు—ఏయ్ !

గృ—అయ్యా !

భ—అయ్యట. అయ్యా యేమిటికొయ్యా ! దీపంపైకి కని పిస్తోంది రిపోర్టు చేసేస్తాను.

గృ—పోనీచెయ్యండి. మూడుసార్లు ఇదివరకు ఈయన చూశారండి, చూసి సరిగానే ఉందన్నారు, అని చెబుతాను.

భ—చెబితే ఏమయినట్టూ ! అక్కడ బాంబుపడిపోతుంది.

గృ—అందుకనే దూరంగావచ్చి ఇక్కడ కూచున్నాను, ఆరుచుట్టలు తెచ్చుగుని.

భ—పోనీ, ఓచుట్ట యిల్లాపారెయ్,

గృ—అయిదు ఇదివరకే కాల్చేశాను.

188

బుజ్జన్న—(గోదావరిస్టేషను ప్లాటుఫారంమీద గుర్లింగాన్ని కలుసుగుని) ఏమోషు ! గుర్లింగం ! ఎక్కడికి ?

గు—పట్నం.

బు—అప్పుడెప్పుడో ఓమాటు వెళ్ళినట్టున్నావు !

గు—అవును, వెనక. చాలారోజులైంది. కాని, అప్పుడు పట్నంలో సహమే చూశాను.

బు—అదేం ? అంతా చూడకపోయావా ?

గు—అంతా ఎల్లాచూడ్డం ? (గాత్రం తగ్గించి) అప్పుడు నేను వెడతా, సగం టిక్కట్టుమీదే. అందుకని !

189

వంటపూటి వ్యాపారంలో జాయింటుదారైన సర్వారావుతో,

విశ్వమ్మ—అబ్బాయి ! సర్వారావు ! ఆ ఆమదాలపురంవా డున్నాడూ, అదుగో, వాడివల్లమనకి ఈనష్టం. వాణ్ణిపొమ్మందూ?

స—ఉండనీండి. ఎంతమందిలేరూ ?

వి—ఓయ్, నీవేళాకోళాలు బంగారంగాను, వాడు కొంప తినేస్తున్నాడోయ్ !

స—ఏం ?

వి—ఏం యేమిటీ ! వాడికి ఏదీ సయించకపోడం లేదు. ఎప్పుడూ రొంపేనా పట్టదు పీనుక్కి. కాశీ తగులడలేదుట, అక్కడ పోసీ ఏమన్నా వొదిలి పెట్టాడేమో అనుకోడానికి. మాటల్లోనిధీ ! కడుపులో అన్నం తీసుకుతింటాడు.

స—ఓహో ! అల్లానా ! నే విన్లేదే ! అన్నమా అధరువా వాడెక్కువ లగాయించేది ?

వి—అన్నీనూ. అన్నంతెస్తే, 'అన్నం పరబ్రహ్మస్వరూపం' అని వదలడు పప్పుతెస్తే పప్పుకీబ్రాహ్మడికీ అవినాభావ సంబంధం అంటాడు. కూరతెస్తే, ఆధరువు ఎక్కువగాలేందే తనకి దిగ దంటాడు.

స—అరి వీణ్ణితగలెయ్యా ! పచ్చడి చూపిస్తే........

వి—పచ్చడిఅంటే తనకి నాలికి లేచివస్తుందంటూ రొట్టి లేస్తాడు. చారు తెస్తే, 'వంటికి మంచిదిష్మండి చారు' అనడ మూనూ ఊహూ దొరచడమూనూ. పులుసు తెస్తే, పులుసు ముక్కలంటే తనకి ప్రాణమనీనీ, వాటికోసం తను వేరే జన్మ ఎత్తుతాననీ అంటాడు. సరి యిక మజ్జిగతెస్తే, ఎంతోసినా సరే, 'ఏది, ఏది, ఒక్క పురుషిడు చేతులో ఉంచండి. మొదణ్ణించీ

ఈ గొడ్డు మజ్జిగతో బతికింది' అంటూండడం, మజ్జిగవంటి పదార్థము ముజ్జగములలోన లేదు—అని పాటకుడా మొదలెడతాడు. ఇదమీడట వీలైతే నిన్నూ, లేకపోతే నన్నూ కొరుక్కు తింటాడు.

స—ఇదోటా ! అల్లాయితే వాణ్ణి తక్షణం సాగనంపుతా !

190

అఘాతకల్పనదారులైన సీనయ్య, మీనయ్య, కోనయ్యలు వేడెక్కిపోయిన ప్రసంగం సాగించుకుంటూ,

సీ—నేను చాలా చలిదేశాలు వెళ్ళాను. అక్కడి చలికి కన్నీళ్ళుకూడా గడ్డకట్టిపోతూండడంవల్ల, ఎంత బాధగా ఉన్నా ఏడుద్దాంఅంటే ఏడ్లేక ఊరుకునేవాణ్ణి.

మీ—సరి సరి, నేను అంతకంటే చలిదేశాలు చూశాను. అక్కడ దీపం గడ్డకట్టిపోయింది, ఓ కఱ్ఱపుచ్చుగుని దీపాన్ని చావగొడితే అప్పుడది ఏడుస్తూ మళ్ళీ వెలుతురు ఇవ్వడం మొదలెట్టింది.

కో—ఒస్ ఇంతేనా ! నేనూ నా స్నేహితు డొకడూ కలిసి మరీ చలిదేశం వెళ్ళాం. అక్కడనేను ఆ స్నేహితుడితో కొన్ని మాటలు అన్నాను. ఆ మాటలు వాడి చెవిమీద వెళ్ళిపడే మధ్యదార్లోనే ఠక్ఠక్మని గడ్డకట్టిపోయాయి. అవన్నీ వాడు పోగుచేసి వెచ్చచేసుగుని తంటాలుపడ్డమీదట వాడికవి బోధపడడం జరిగింది.

సంపూర్ణం.